LONGEST LIVING NEWSPAPER IN TELUGU JOURNALISM

Visit Internet Edition @ www.nellore.com

# జమీన్ రైతు



స్థాపకుడు : నెల్లూరు వెంకట్రామానాయుడు | సంపుటి : 71 | సంచిక : 9 | 25.2.2000 శుక్రవారం | 12 పేజీలు | విడిప్రతి: రూ.2.00లు | జీవప్రదాత : నెల్లూరు శ్రీరామమూర్తి

# సమర్థత వెనక్కి - సర్దుబాటు ముందుకి

కౌన్సిలర్ అభ్యర్థుల ఎంపికలో తెలుగుదేశానికి సంబంధించి రమేష్‌రెడ్డి చేతులు కట్టివేశారు. ఒక్క వార్డులో కూడా తనకు తానుగా స్వేచ్ఛగా నిర్ణయం తీసుకోలేకపోయాడు. తెలుగుదేశంలోని గ్రూపులు, నాయకుల మధ్య సర్దుబాట్లకి ప్రాధాన్యత నిచ్చి, సమర్థులను వెనక్కునెట్టవలసి వచ్చింది. మొత్తం 44 వార్డులలో పన్నెండింటిని బిజెపికి వదలక తప్పలేదు. దానితోనే సగం నడుం విరిగిపోయినట్లు బాధపడుతుండిన రమేష్‌రెడ్డికి తతిమా తెలుగునేతల గొంతెమ్మ కోరికలు మూలిగే నక్కమీద తాటికాయ పడ్డాయి. శ్రీధరకృష్ణారెడ్డి నేతృత్వంలోని అసమ్మతి వర్గం డజను సీట్లు, కొత్తగా పార్టీలో చేరిన వైటి.నాయుడు మూడు వార్డులు, కెవి. సుబ్బారెడ్డి నాలుగు అడిగారు. ఇవికాక కాంగ్రెస్‌లో టిక్కెట్లు రాక భంగపడిన వారికి తనే ఆశ్రయం కల్పించవలసి వచ్చింది. ఒకేసారి ఇందర్ని సంతృప్తి పరచవలసి రావడంతో రమేష్‌రెడ్డి తీవ్రారైపోయాడు. తన స్వంత అనుచరులు, తప్పక గెలుస్తారు అనుకున్న వారందరినీ వెనక్కునెట్టి, సర్దుబాటు అభ్యర్థులను రంగంలోకి దింపవలసి వచ్చింది. అప్పటికీ ఎంతో ప్రతిఘటన ఇచ్చారు. రమేష్‌రెడ్డి తీరు చూసి మంత్రి ప్రభాకరరెడ్డి బిత్తరపోయాడట. ఏ వార్డులో ఏ అభ్యర్థి పేరు చెప్పినా - మీరు అంత వత్తిడి చేస్తే నేను ఛైర్మన్ క్యాండిడేట్ నేత

## తెలుగు అసమ్మతి నెగడు ఇంకా చల్లార లేదు!

విత్‌డ్రా చేయించేస్తా - అని బెదిరించడంతో పాపం ప్రభాకరరెడ్డి బిత్తరపోయాడు. ఇంతగా నిరోధించి నప్పటికీ రమేష్‌రెడ్డి చాలా వార్డులు వదులుకోక తప్పలేదు. వైటి. నాయుడికి 3 వార్డులు (4,5,6); శ్రీధరకృష్ణారెడ్డికి రెండు (8,10); అరిగెల కోదండరామయ్యకు ఒకటి (29); వేలూరు దశరథరామయ్యకు ఒకటి (37); కెవి. సుబ్బారెడ్డికి రెండు (17, 25) వార్డులు సమర్పించారు. ఈ సర్దుబాట్లతో తన స్వంత అనుచరులు - ధర్మవరపు సుబ్బారావుకు చివరి నిమిషంలో టిక్కెట్ ఇచ్చారు, దగ్గు సుబ్బారావు, పి. శ్రీనివాసులు వంటి వారిని ప్రక్కన పెట్టేశారు.

### అసమ్మతి నెగడు చల్లారలేదు

ఇంత చేసినా అసమ్మతి నెగడు మాత్రం మండుతూనే ఉంది. టౌన్‌లో ఏం ప్రథమంగా రమేష్‌రెడ్డిపై తిరుగుబాటు లేవదీసిన మాజీ యూత్ అధ్యక్షుడు వైవి. రామిరెడ్డి; తనకెంతో ఆప్తుడుగా భావించి ఒకటికి రెండు సార్లు రంగడి గుడి ధర్మకర్తల మండలి ఛైర్మన్‌గా నియమించిన చర అనబడే దువ్వూరు శరత్‌చంద్ర; తన అండతోనే కోట్లు విలువచేసే ప్రభుత్వ స్థలం పెట్రోలు బంకు కోసం ఉచితంగా పొందిన పిటి. రంగరాజన్ వంటి వారిని రమేష్‌రెడ్డి దూరం పెట్టేశాడు. వారికి ఒక్క వార్డూ ఇవ్వలేదు. *

# వినడంలో వినయం నిర్ణయాల్లో స్వతంత్రం!

తెలుగుదేశం గ్రూప్ తగాదాల మధ్య ఎంతగా నలిగిపోయిందో, కాంగ్రెస్ పార్టీ నియంతృత్వంతో అంతే నలత పడుతున్నది. 44 వార్డుల ఎంపికలోనూ ఆనం వివేకానంద రెడ్డి స్వయం నిర్ణయం తీసుకున్నాడు. ఇంకొక నాయకుడ్ని, వర్గాన్ని దగ్గరకు రానివ్వలేదు. "వినదగునెవ్వరు చెప్పిన" అన్న వేమన పద్యం చిన్నప్పుడు చాలా సార్లు చదివాడేమో తెలియదుగాని, ఎవరు చెప్పినా వినడం తప్ప, నిర్ణయం మాత్రం తనదే! దానితో విపరీతమైన వత్తిడి, మానసికాందోళన సైతం తానే భరించవలసి వచ్చింది.

## టిక్కెట్ల పంపిణీలో వివేకా ధోరణి

దాదాపు 40వార్డులలో వివేక స్వయం నిర్ణయం జరిగింది. ఒక్క డిసిసి అధ్యక్షుడు సివి. శేషారెడ్డి మాత్రం హఠం పట్టి, అలుకవహించి, ఆగ్రహం ప్రదర్శించి, ఆవేదన వ్యక్తం చేసి రెండు వార్డులు తన అనుచరులకు ఇప్పించుకున్నాడు. 20వార్డు విషయంలో సివి. వివేకాల మధ్య రామరావణ యుద్ధమే జరిగింది. మొన్నటి అసెంబ్లీ ఎన్నికల్లో రిస్క్ చేసి మరీ తనకు పనిచేసిన నరేంద్రరెడ్డి అనే భక్తవత్సలనగర్ వాసికి టిక్కెట్టివ్వాలనేది సివి పంతం; తమ వర్గానికి అతి ముఖ్యుడు, కౌన్సిల్‌లో సీనియర్ కౌన్సిలర్ కెవి. రాఘవరెడ్డికి ఇంకెక్కడా పోటీకి వార్డు లభించడం లేదు కాబట్టి, ఇక్కడ ఆయన్నే నిలపాలన్నది వివేకానందరెడ్డి హఠం. కస్తూరిదేవి విద్యాలయం తర్వాత - టౌన్ దక్షిణ పొలిమేరల వరకు ఒక్క వార్డుకూడా మిగలకుండా రిజర్వుడు అయిపోవడంతో ఈ పరిస్థితి ఏర్పడింది. రెండువారాల పాటు సివి. వివేకాలిద్దరూ మంకుపట్టు సడలించలేదు. చివరకు రాఘవరెడ్డి పెద్ద మనసుచేసుకొని, తన కోసం

తొరవ 2వ పేజీలో

## జనార్దనరెడ్డి జోక్యం చేసుకోలేదు!

ఈ మునిసిపల్ ఎన్నికలలో మాజీ ముఖ్యమంత్రి నేదురుమల్లి జనార్దనరెడ్డి ఏ దశలోనూ జోక్యం చేసుకోలేదు. వార్డు కౌన్సిలర్ టిక్కెట్ల కోసం తనను ఎందరు ఎన్ని విధాల అభ్యర్థించినా - వివేకానంద రెడ్డికే ఫ్రీహ్యాండ్ ఇచ్చారు. మునిసిపల్ రాజకీయాల మురికిలో వేలు దూర్చడం తన స్థాయికి తగినది కాదన్న నిగ్రహం; ఎన్నిక బరువు సమస్తం మోయవలసిన వాడు వివేకానందరెడ్డి కాబట్టి తలా ఒక చెయ్యి వేస్తే డిస్టర్బ్ అయిపోతాడన్న భావం - జనార్దనరెడ్డి గారు టిక్కెట్ల ఎంపిక ప్రక్రియకు దూరంగా మసలడానికి కారణం.

పార్టీ శ్రేయస్సు కోసం ఎంతో హుందాగా ప్రవర్తించారాయన. తనకు లభించిన గౌరవం కాపాడుకోవడం వివేకానందరెడ్డి చేతుల్లో వుంది. *

# ఒప్పందాల వెనుక వెన్నుపోట్లు!

గూడూరును గబ్బూరు అని పిలవడం ఎప్పటి నుంచో వున్నదే. ఆ సార్థక నామధేయం శాశ్వతంగా నిలుపుకోవడానికి అక్కడి మునిసిపల్ కౌన్సిలర్లందరూ ఎంతో కష్టించి పని చేస్తున్నారు. గూడూరు మునిసిపల్ రాజకీయాలలో ఒక స్పెషాలిటీ వుంది. ఎన్నికల వరకే ఒకరికి ఒకరు శత్రువులు; ఆ తర్వాత పెట్టగానే అందరూ ఒకటే! సాంప్రదాయ మహమ్మదీయ కుటుంబాలలో ఇంటిల్లపాదీ ఒకే చాపపై కూర్చుని, ఒకే కంచంలో భోం చేసినట్లు - అన్ని పార్టీల కౌన్సిలర్లూ మునిసిపల్ నిధులను బాదం హల్వా తిన్నంత పసందుగా ఆరగిస్తుంటారు. ఈ తినడంలో పేచీలుండవు, పోటీలుండవు, పంతాలూ వుండవు; అంతా సామ్యవాదం; అంత ఐక్యత మరెక్కడా చూడలేం మనం. గత నాలుగైదేళ్లలో జన్మభూమి క్రింద దాదాపు పది కోట్ల రూపాయలు రోడ్ల పద్దుల్లో ఖర్చయినాయి; లోకాస్ట్ శానిటేషన్ పథకం కోసం మూడు కోట్ల 75లక్షలు వెచ్చించారు; నేషనల్ స్లమ్ డెవలప్‌మెంట్ ప్రోగ్రాం క్రింద ఐదారు కోట్లు వ్యయం చేశారు. గూడూరు చాలా చిన్న టౌన్. పట్టుమని పది చదరపు కిలోమీటర్ల విస్తీర్ణం వుండదు. జనాభా 70 నుంచి 80వేల లోపు. ఈ నాలుగైదేళ్లలో అన్నీ కలిపి రమారమి పాతిక కోట్ల ఖర్చుతో అభివృద్ధి పనులు జరిగాయి అక్కడ. కాని టౌన్ ముదనష్టపు రూపం మాత్రం ఏ కొంచెం కూడా మారలేదు. పైపెచ్చు మరింత మురికికూపమై పోయింది. గూడూరుకు గుండెకాయ అనదగిన బజారు వీధిలో నడిచి చూస్తే చాలు - తమ వూరికి గబ్బూరు అనే పేరు చిరస్థాయిగా నిల్పుకోవడానికి పురపాలక నేతలు ఎంత గొప్పగా శ్రమపడుతున్నదీ అర్థం చేసుకోవడానికి! ఇప్పటికి రెండుసార్లు సిమెంట్ కాంక్రీట్ వేశారట ఈ రోడ్డుపైన;

## గూడూరు ఎన్నికల రంగంలో అవినీతి గరం, గరం!

కాని ఇప్పుడు చూస్తే దానిపైన సిమెంట్ ఆనవాలు కూడా కన్పడడం లేదు. అలలు అలలుగా, గతుకులు గతుకులుగా - కారులో వెళ్తుంటేనే ఎగిరెగిరి పడవలసి వస్తున్నది. గాంధీబొమ్మ సెంటర్ నుంచి బస్టాండు వరకు వచ్చే చిన్న సందు - అదీ సిమెంట్ వేసినట్లు లెక్కల్లో వుంది; కాని డొంక రోడ్డుకంటే హీనం; పైగా బురద!. బస్టాండు పరిస్థితి చూస్తే రోత రావడం ఖాయం.

ఆరంటే ఆరు నెలల్లో వేసిన ఆనవాళ్లు సైతం కనుమరుగై పోయేంత అద్భుత అవినీతి టెక్నాలజీతో సిమెంట్ కాంక్రీట్ రోడ్లు వేయిస్తున్న మునిసిపల్ మహారాజులను మళ్లీ మళ్లీ ఓట్లేసి గెల్పిస్తున్న గూడూరు పౌరులను కీర్తించ డానికి ఏ పదకోశంలోనూ పదాలు చాలవు. తమ దగ్గరకు ఓట్ల కోసం వచ్చే వారిని చొక్కా పట్టుకొని నిలేసి, చెప్పుతో కొట్టకుండా పూలదండలు వేసి మరీ స్వాగతిస్తున్న గూడూరు పురప్రజల సహనశీలత్వానికి, క్షమాగుణానికి జోహార్లు పలుకవలసిందే!

ఈ సోదంతా దండగని ఈ విలేఖరికి తెలుసు; కాని మునిసిపల్ రాజకీయ ముచ్చట్లు ఎట్లా వున్నాయో చూద్దామని గూడూరు వీధుల్లో తిరుగుతుంటే కలిగిన అభిప్రాయాలను కాళ్ల గ్రక్కకుండ వుండబట్టలేకే ఈ సోది చెప్పడం!

***

గూడూరులో కాంగ్రెస్, తెలుగుదేశం మునిసిపల్ ఛైర్మన్ అభ్యర్థుల ఎంపిక చాలా సాఫీగా, సుకరంగా, అనాయాసంగా జరిగిపోయిందని; ఏకాభిప్రాయం ఎల్లెడలా పరిఢవిల్లిందని భావిస్తూ వచ్చామింత కాలం. కాని అది మేడిపండు మేలిమి తప్ప నిజమైన మెరుగు కాదని ఇప్పుడర్థమౌతున్నది. పొట్ట విప్పి చూస్తే అన్నీ పురుగులే, లుకలుకలే! కాంగ్రెస్‌కు సంబంధించి హోల్మొత్తం కథ అడ్డం తిరిగింది. నిత్య అసంతృప్తజీవి, రాజకీయ తామర వంటికంతా అంటు

తొరవ 7వ పేజీలో

# రంగంలో అబలలు - రణంలో నేతలు

రెండు పార్టీల నేతలూ కౌన్సిలర్ టిక్కెట్ల పంపకంలో తలలు బ్రద్దలు కొట్టుకుంటుండంతో ఛైర్మన్ అభ్యర్థినులు ఇద్దరూ మౌనప్రేక్షకుల వలె నిరీక్షిస్తున్నారు. వారి నామినేషన్ల తతంగం పూర్తయినా ప్రచారం ప్రారంభం కాలేదు. మహిళా అభ్యర్థినులు కావడం, ఇద్దరికీ రాజకీయాలు కొత్త కావడంతో తమంత తాముగా స్వతంత్రించి ఓట్ల వేటకు కదలలేక పోతున్నారు. దానితో రాజకీయ వాతావరణం స్తబ్దుగా వుంది. నామినేషన్ల ఉపసంహరణ పూర్తయి, కౌన్సిలర్ అభ్యర్థులు తమ తమ వార్డులలో కాలు, చెయ్యి కూడదీసుకున్నంత వరకు ఛైర్మన్ అభ్యర్థినులు ఎదురు చూడవలసిందే!

పార్టీల పరంగా చూస్తే తెలుగుదేశం రెండడుగులు ముందు వున్నట్లు కన్పిస్తున్నది. అది అధికార పార్టీ; అపర కుబేరుడు అనదగిన జిల్లా మంత్రి ఆదాల ప్రభాకరరెడ్డి ప్రత్యక్ష సారథ్యం వహిస్తున్నాడు. అభ్యర్థిని శ్రీమతి అనురాధ - రమేష్‌రెడ్డి సతీమణి; ఆయనకు టౌన్ అమూలాగ్రం తెలుసు; తెలుగుదేశంలో ప్రతి వార్డుకూ ఒక నాయకుడు వున్నాడు; అన్నిటికీ మించి బిజెపితో మైత్రి వారికి కొండంత బలం.

కాంగ్రెస్ కూడా సిపిఎం సహకారం తీసుకోవడానికి ఎంతో ప్రయత్నం చేసింది. కాని జక్కా వెంకయ్య గారు ఇష్టపడలేదు. తెలుగుదేశం, బిజెపి పార్టీలను ఓడించడం తమ లక్ష్యం అంటూనే - కాంగ్రెస్‌తో చెలిమి కట్టడానికి సిద్ధపడలేదాయన. పన్నెండు వార్డుల్లో తమ అభ్యర్థులను నిలిపింది సిపిఎం పార్టీ. టౌన్ మొత్తం మీద ఛైర్మన్ ఓటు; తమ అభ్యర్థులు లేనిచోట కౌన్సిలర్ ఓటు కూడా కాంగ్రెస్‌కే వేయమని తమ కార్యకర్తలకు సూచించారు వారు. ఈ డొంక తిరుగుడు లేకుండా నేరుగా ఎన్నికల పొత్తు కుదుర్చుకొని వుంటే తెలుగుదేశం, బిజెపి కూటమికి - కాంగ్రెస్, సిపిఎం కూటమి ధీటుగా నిల్చి వుండేది.

కాంగ్రెస్ బలమంతా - మొన్నటి అసెంబ్లీ ఎన్నికల్లో ఆనం సోదరులిద్దరూ ఎమ్మెల్యేలుగా గెలవడం; వివేకానందరెడ్డికి టౌన్ రాజకీయం కొట్టిన పిండి. 1981 నుంచి నెల్లూరు మునిసిపల్ ఎన్నికలకు సారథ్యం వహిస్తున్నారాయన. ఏ వీధిలో ఏ ఎత్తు వేస్తే రాజకీయం ఏ మలుపు తిరుగుతుందో తెలుసు. అధికార పార్టీలో లేకపోయినా, అధికారం చలాయించుకోగల నైపుణ్యం వుంది.

అభ్యర్థినుల పరంగా చూస్తే కాంగ్రెస్‌దే పైచేయి. డాక్టర్ పి.యశోధర కేవలం విద్యావంతురాలే కాదు; జనంలోకి చొచ్చుకపోయే చొరవ, ఏ విషయం పైనైనా ధారాళంగా మాట్లాడగల్గే చాతుర్యం, విషయ పరిజ్ఞానం కల్గిన చురుకైన వనిత. ఒకసారి ఆమెతో మాట్లాడిన వారెవరైనా సరే - మెచ్చుకోకుండా వుండలేరు. ఛైర్మన్‌గా గెలిస్తే పురపాలనలో కొత్తదనం తేవాలని, కొత్త కొత్త పద్ధతులు ప్రవేశపెట్టాలని తపనపడుతున్నారామె. ఆమెలో ఉత్సాహం, ఉద్వేగం పరవళ్లు తొక్కుతున్నాయి.

తెలుగుదేశం అభ్యర్థిని అనూరాధ పతిచాటు సతి. మహిళా స్థానం కాబట్టి, రమేష్‌రెడ్డి భార్యగా రాజకీయ రొంపిలో కాలు పెట్టిందే తప్ప - స్వతంత్ర వ్యక్తిత్వం, స్వతంత్ర పోకడలు వున్నట్లు కన్పించడం లేదు. ఇప్పటి ప్రచారమైనా రేపటి పరిపాలన అయినా రమేష్‌రెడ్డి చేతుల మీదుగా జరగవలసిందే.

## కౌన్సిలర్ పదవులపై ఎందుకీ ఆరాటం!

నెల్లూరు మునిసిపల్ ఛైర్మన్ అభ్యర్థుల ఎంపిక ఎంత సాఫీగా జరిగిపోయిందో, కౌన్సిలర్ టిక్కెట్ల పంపకం అంతగా మడత పేచీ పడిపోయింది. తెలుగుదేశం, కాంగ్రెస్‌లు రెండింటిలోనూ అదే పరిస్థితి. ప్రతి వార్డులోనూ పోటీయే; రచ్చరచ్చగా వుంది. కౌన్సిలర్లు కాగోరేవారు ఒక వంక ఆరాటపడుతుంటే, తమ అనుచరులకు టిక్కెట్లు ఇప్పించుకోవడానికి పార్టీలోని పెద్ద నేతలు ఇంకొక ప్రక్క ఆయాసపడుతున్నారు. అలకలు, ఆగ్రహాలు, ఆవేశాలు, రోదనలతో రెండు పార్టీల శిబిరాలూ గందరగోళ మౌతున్నాయి. తెలుగుదేశంలో రమేష్ రెడ్డి ఇంటి ఎదుట రెండు రోజుల నుంచి ఎంత రచ్చగా వుందో చెప్పలేము. మందలు మందలుగా జనాన్ని వెంటబెట్టుకొని రావడం, అడగడం, అభ్యర్థించడం, ఆవేదన వ్యక్తం చేయడం వంటివన్నీ ముగిసిన తర్వాత టిక్కెట్లకు లంకించుకోవడం పరామామూలై పోయింది.

టిక్కెట్ రానివారు తమ ఇంట్లో ఆప్తులెవరో గతించినట్లు బాధపడుతున్నారు. బిగ్గరగా ఏడుస్తున్నారు. తమకు టిక్కెట్ రానివ్వకుండా చేసిన వారిని శాపనార్థాలు పెడుతున్నారు.

కౌన్సిలర్ పదవిలో అంత మాధుర్యం వుందా? ఆశ్చర్యమే! చాలా చిన్నపదవి అది. దానితో పెరిగే హోదా ఏదీ లేదు. పైగా బండ చాకిరీ. వీధిలో లైటు వెలగకున్నా, కొళాయిల్లో నీళ్లు రాకున్నా, రోడ్లలో గుంటలు పడినా, తొట్టిలో నుంచి చెత్త ఎత్తకపోయినా జనం తిట్టేది కౌన్సిలర్నే! జీతభత్యాలుండే వుద్యోగమూ కాదు. అయినా అంతగా వెంపర్లాడుతున్నారంటే - అసలు రహస్యం అవినీతి మాత్రమే అనడం సబబు. గత నాలుగేళ్లుగా జన్మభూమి పథకం క్రింద ప్రతి కౌన్సిలరూ రెండు మూడు కోట్ల రూపాయల కాంట్రాక్టు పనులు చేశారు; పది నుండి పాతిక లక్షల వరకు ఆర్జించారు. సైకిళ్లలో తిరుగుతుండినవారు కార్లుకొన్నారు. ఆ సిరి చూసి ఎదుటివారిలో కన్నుకుడితే దాన్ని అనుభవించిన వారు వదలుకోలేక పోతున్నారు. ఎంత చెట్టుకు అంతగాలి తోలినట్లే - ఎంత పదవికి అంత ధనలాభం లెక్కించడం ఆనవాయితీ కదా? - ఈ సూక్ష్మం గ్రహించగల్గిన వారికి టిక్కెట్ కొరకు కాటాకుస్తీలు పడుతున్న ఆరాటం అర్థమౌతుంది. *

## స్వతంత్రం

మొదటి పేజీ కొరవ

జిల్లా కాంగ్రెస్ స్థాయిలో సంక్షోభం తలెత్తడం అనవసరమని భావించి, తనకు తానుగా, హుందాగా రంగం నుంచి తప్పుకోవడంతో సమస్య పరిష్కారమై పోయింది.

ఇరవయ్యేళ్లు కౌన్సిలర్‌గా వుండి, వార్డు అభివృద్ధిలో టౌనంతటికీ నంబర్ వన్ అన్పించుకొని, మునిసిపాలిటీలో తనకు ఎదురు లేకుండా బ్రతికిన రాఘవరెడ్డి ఏ మాత్రం సంకోచం, తడబాటు లేకుండా కౌన్సిలర్ పదవిని వదలుకున్నాడు కాని - కొత్తగా రాజకీయాలలోకి రాదలచుకున్న యువకులు మాత్రం టిక్కెట్ రాకుంటే తమ ప్రాణం పోతుందన్నట్లు విలవిలలాడి పోయారు.

మొన్నటి అసెంబ్లీ ఎన్నికలలో వివేకాకు వ్యతిరేకంగా అసమ్మతి కూటమి ఏర్పరచి, నాయకత్వం కూడా వహించిన చేవూరు దేవకుమార్‌రెడ్డి తన అనుచరులు ఒకరిద్దరికి సీట్లు తెచ్చుకోగలిగారు. అయితే దేవకుమార్ ఏ దశలోనూ వివేకాతో ప్రత్యక్ష సంభాషణ జరపక పోవడం విశేషం. మేఘ సందేశాలతోనే నడిచింది.

ఇవి నాలుగు మినహా తతిమా వార్డులన్నీ స్వతంత్రించి ఎంపిక చేయడంతో మొత్తం ఎన్నికల బరువూ వివేకానందరెడ్డిపైనే పడుతున్నది. ఛైర్మన్‌ను గెల్పించే బాధ్యతనూ ఒంటరిగానే నిర్వర్తించవలసి వుంటుంది! *





# స్విస్ మంత్రి హేళన

మన ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడిని ఒక అబద్ధాల కోరుగా, పిచ్చివాడిగా జమకట్టి స్విట్జర్లాండ్ ఆర్థికమంత్రి పాస్కల్ కుప్పే హేళన చేయడం బాధాకరమైన విషయం. తప్పులను ఎత్తి చూపడం వేరు; తృణీకార భావంతో తిట్టడం వేరు. స్విస్ మంత్రితిట్టి పోయాడు. చంద్రబాబు తయారు చేయించిన విజన్ 2020 ప్రణాళిక వట్టి అంకెల గారడీ అని మనకు తెలుసు. మభ్యపెట్టి, మాయమాటలు చెప్పి, అర చేతిలో స్వర్గం చూపించి ఇన్వెస్టర్ల నుంచి డబ్బు రాబట్టడానికి రియల్ ఎస్టేట్ సంస్థలు, షేర్ మార్కెట్‌కు రాబోతున్న కంపెనీలు ప్రాజెక్ట్ రిపోర్టులు తయారు చేసే రీతిలో రాష్ట్ర ప్రజలను వంచించడానికి చంద్రబాబు తను విజన్ 2020ని వాడుకొంటున్నాడనే మనకు తెలుసు. ఇరవయ్యేళ్లలో 36లక్షల కోట్ల రూపాయలు పెట్టుబడి పెడితే తప్ప అందులో వ్రాసిన పనులు చేపట్టడం సాధ్యం కాదు. అంటే ఏడాదికి లక్ష కోట్ల రూపాయల పైన పెట్టుబడి పెట్టాలి. మన రాష్ట్ర ప్రణాళికా బడ్జెట్ ఇందులో ఇరవయ్యో వంతు కూడా లేదు. సంవత్సరానికి ఐదు వేల కోట్ల నిధిని సమకూర్చుకోవడం అలవికాక - ఉద్యోగులకు జీతాలివ్వడానికే కటకటలాడిపోయే రాష్ట్ర ప్రభుత్వం ఈ లక్షల కోట్లు ఎక్కడ నుంచి తెస్తుంది? ఏ రూపంలో సేకరిస్తుంది. మొత్తం దేశం బడ్జెట్ అంతటినీ ఆంధ్రప్రదేశ్‌కు తరలించినా విజన్ 2020లక్ష్యాలు చేరుకోవడం కష్టం.

కాని చంద్రబాబు ఇవేవీ పట్టించుకోకుండా దాన్ని గురించి పదే పదే మాట్లాడుతున్నారు. ఏ విదేశీ ప్రతినిధి రాష్ట్ర పర్యటనకు వచ్చినా విజన్ 2020పైన ఒక కంప్యూటర్ స్లైడ్ షో ఇవ్వడం అలవాటై పోయింది. తిరునాళ్లలో కాశీపట్నం చూడరబాబూ అని పాటలు పాడుతూ తిరిగేవాడి వలె వుంటాయి ఈ ప్రదర్శనలు. ఇప్పటి వరకు హైదరాబాదుకు వచ్చి వెళ్లిన విదేశీయులందరూ ఈ గారడీ ప్రదర్శనను తిలకించి, గమ్మున వెళ్లిపోయే వారు. కాని స్విస్‌మంత్రి మాత్రం వుండబట్టలేక తన మనసులోని మాట పైకి చెప్పేయడంతో చంద్రబాబు నవ్వుల పాలైనాడు; రాష్ట్రమూ ఎగతాళి ప్రాయమై పోయింది.

సమయం, సందర్భం లేకుండా హైదరాబాదుకు వచ్చే ప్రతి విదేశీయుడి ముందూ తన కంప్యూటర్ పరిజ్ఞానం ప్రదర్శించి చూపడం చంద్రబాబు చేసిన తప్పు. విజన్ 2020 అంటే ఒక ప్రణాళిక. ఇది ప్రపంచంలో ఎవ్వరూ ఎప్పుడూ చేయని ఘనకార్యం కాదు. ప్రతిదేశము, ప్రతి రాష్ట్రము, ప్రతి వ్యాపార సంస్థ తమ తమ భవిష్యత్ లక్ష్యాలు నిర్దేశించుకోవడానికి ఇటువంటి ప్రణాళికలు తయారు చేసుకోవడం అనాది నుంచి వస్తున్న సాంప్రదాయమే. ఎప్పుడో యాభై ఏళ్ల క్రితమే జవహర్‌లాల్ నెహ్రూ మన దేశంలో పంచవర్ష ప్రణాళిక పద్ధతి ప్రవేశపెట్టారు. ఇందిరాగాంధీ ఇరవై సూత్రాల ప్రణాళిక దేశంలో ప్రజాజీవితాన్ని ఎంత గొప్ప మలుపు త్రిప్పిందీ మనకు అనుభవమే. ఈనాడు దేశ ప్రజలకు సరిపడా తిండి లభింప జేసింది ఈ ప్రణాళికలే; మన ఆటంబాంబులు, అంతరిక్ష ఉపగ్రహాలు, భారీ పరిశ్రమలు, భాక్రానంగల్, నాగార్జున సాగర్ వంటి ప్రాజెక్టులు ప్రణాళికా బద్ధంగా జరిగినవే. ప్రణాళికల అమలులో లోపాలు, లక్ష్యాల సాధనలో వైఫల్యాలు వున్నమాట నిజమే కాని - అసలు విజన్ 2020 వంటి ప్రణాళికలు తయారు కావడమే చంద్రబాబు ప్రారంభించిన మహత్కార్యం అని భావించడం మాత్రం పచ్చిమోసం.

దురదృష్టవశాత్తు దినపత్రికలు, టెలివిజన్లపై చంద్రబాబుకు గల అదుపు వల్ల రాష్ట్ర మంతటినీ ఒక ప్రచార మేఘం క్రమ్ముకొని వుంది. ఆయన ఏది చెప్తే అదే నిజం, ఆయన ఏది చేస్తే అదే సహేతుకం, ఆయన ఏది సాధిస్తే అదే ఘన విజయం అన్న భ్రమ ప్రజల మెదళ్లలో నాటుకుపోయేట్లు చేస్తున్నారు. ప్రభుత్వ నిర్ణయాలు, రాజకీయ సంఘటనలపై విశ్లేషణాత్మక వివరణలు ప్రజలకు లభ్యం కావడం లేదు. హైదరాబాదు నగరంలో రోడ్లు వెడల్పు చేయడం, ఫ్లైఓవర్లు కట్టడం మాత్రమే నిజమైన రాష్ట్రాభివృద్ధి అని చంద్రబాబు చెప్తే జనం గుడ్డిగా నమ్మేస్తున్నారు తప్ప - ఒక్క మెగావాట్ కరెంట్ అదనపు ఉత్పత్తి జరగకుండా, ఒక్క కొత్త పరిశ్రమ స్థాపించకుండా, ఒక్క నీటిపారుదల ప్రాజెక్ట్ కట్టకుండా విశాలమైన నగర రోడ్లతో రాష్ట్ర

**జమీన్‌రైతు**

ప్రజలు ఎట్లా బ్రతుకుతారు, ఎట్లా అభివృద్ధి సాధిస్తారు అన్న ఆలోచన జనంలో కల్గడం లేదు. ప్రచార సాధనాలు ప్రజలకు ఆ అవకాశం కల్పించడం లేదు. చంద్రబాబు ప్రచార యజ్ఞం ఒక విధమైన హిప్నాటిక్ విద్యవలె పనిచేస్తున్నది.

కాని విదేశీ ప్రతినిధులపై ఈ మాయలు మంత్రాలు పని చేయవు కదా! అందువల్లనే స్విస్ మంత్రి - నీబోటి అబద్ధాల కోరును, మాటల గారడీవాడిని మా దేశంలో అయితే జైలులో పెడతారు, లేదంటే పిచ్చి ఆస్పత్రిలో చేరుస్తారు అని నిర్మొగమాటంగా చెప్పేశాడు. అయితే ఇతర దేశాల నుంచి వచ్చే వ్యక్తులు, వారెంత పెద్దవారైనప్పటికీ మన గురించి వ్యాఖ్యానాలు చేయడం సత్సాంప్రదాయం కాదు. దౌత్య నియమాలకు విరుద్ధం అది. ఇతర దేశాల నుంచి వచ్చే వారు కొన్ని పద్ధతులు పాటించాలి. మాటా, పలుకు, ప్రవర్తన, నడవడిక అన్నీ ఒక క్రమంలో వుండాలి. అంతర్జాతీయ స్థాయిలో ఇందుకు స్పష్టమైన సాంప్రదాయాలు ఏర్పడివున్నాయి. స్విస్ మంత్రి వీటన్నింటినీ ఉల్లంఘించినట్లె లెక్క. ఢిల్లీ స్థాయిలో అయితే ఈ వ్యాఖ్య పెద్ద రాజకీయ వివాదమై వుండేది. ఎందువల్లనో ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు దొంగకు తేలుకుట్టినట్లు గమ్మునుండి పోయారు. ఆయన వూరకుండినా ఇది మన ఆత్మగౌరవానికి సంబంధించిన విషయం. మనలో మనకు ఎన్ని విభేదాలైనా వుండవచ్చు; మనలో మనం ఎన్ని తప్పులైనా చేయవచ్చు, కాని అవి మన వరకే పరిమితం. ఇతర దేశాల వారు మన నాయకులను పిచ్చివాళ్లగా, అబద్ధాల కోరులుగా జమకట్టి, ఎగతాళి చేయడం సహించరాని విషయం. కేంద్ర ప్రభుత్వం స్విస్ మంత్రి వ్యాఖ్యల పట్ల ఆదేశానికి నిరసన తెలియజేయడం సముచితంగా వుంటుంది.

* * *

## 50 ఏళ్లక్రితం ఈ వారం

**జమీన్‌రైతు**

24.2.50

వెల: 0-2-0 పేజీలు: 10

### సుబ్బులక్ష్మి పాటకచ్చేరి

కస్తూరిదేవి విద్యాలయ సహాయార్థం నెల్లూరులో శ్రీ గోపాలురెడ్డిగారి సమాదరము 24.50 ఆదివారం ఎం.ఎస్. సుబ్బులక్ష్మి పాటకచ్చేరి. విద్యాలయమున నిర్మించబడు గొప్ప పందిరిలో జరుగును. సుమారు 5వేల మందికి ప్రవేశము కలదు. ఈమె భారతదేశములో అనేక సంస్థలకు యిట్టి ఉచిత ప్రదర్శనములనిచ్చి వేనకువేలు సహాయము చేసిన విదుషీమణి.

ఈమెగారి ప్రదర్శనమునకు గాని 60, 70వేల వసూలుకు తగ్గినదిలేదు. ఢిల్లీ, బొంబాయి లాంటి పట్టణాల్లో గూడా లక్షలాది సమకూడినది.

తామెల్లరు విచ్చేసి శ్రీకస్తూరిదేవి విద్యాలయము ద్వార స్త్రీ విద్యకు చేయూత నిత్తురని ప్రార్థన.

-పొణకా కనకమ్మ
-రేబాల దశరథరామిరెడ్డి
-తిక్కవరపు రామిరెడ్డి

### ముమ్మడివరంలో ప్రజల ముమ్మరం

ఐదారు లక్షల మంది బాలయోగి దర్శనార్థం వచ్చారు. సమాధిలో నుండి 16తారీఖున ఉదయం, రాత్రి గూడా అందరికీ కనబడ్డారు. అసలు పుట్టింది మాలపల్లెలో, హరిజన కుటుంబం నుండే. తిండి తీర్థం లేక స్నానం లేక మలమూత్ర విసర్జన లేక యోగాభ్యాసములో వున్నమాట నిజం.

వీరబ్రహ్మంగారు పుట్టాడని, సాయిబాబా అవతరించాడని, శ్రీకృష్ణుడు ఉదయించాడని, నారదుడు జన్మించాడని ఎన్నో కథలల్లారు. మానవ ప్రయత్నాన్ని నమ్మరు. మానవశక్తిని నమ్మరు. ఇక్కడితో ఊరుకుంటే నయమనిపించు కోవచ్చు.

కూలోడి మగబిడ్డ మాలవాడు మహాయోగి అంటూ అప్పుడే ప్రారంభించారు. యింకో ప్రచారం. అబ్బే అతడు ముందు జన్మలో అసలు బ్రాహ్మణుడంటూ....

బాలయోగి పట్టును కృతయుగ ధర్మమనుకుంటూ ఈ ప్రచారాలను కలికాల కర్మం అనుకోడం మంచిది.

- సవ్యసాచి

### నెల్లూరు ముచ్చట్లు

#### కలెక్టరు శెలవు

వీరు మే నెల నుండి శెలవు పెట్టగా మార్చి 10తేది నుండే శెలవంగీకరిం

తరువాయి [illegible] పేజీలో

## జనవాణి

# చంద్రబాబూ! డంబాలు ఆపవయ్యా!

హైదరాబాద్ పర్యటన కొచ్చిన స్విట్జర్లాండ్ ఆర్థికమంత్రి పాస్కల్ కుప్పే ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడికి చక్కని హితవు చెప్పారు. 20ఏళ్లలో స్థూల జాతీయోత్పత్తికి ఏడురెట్లు రాష్ట్ర అభివృద్ధి సాధిస్తానని చంద్రబాబు కాకమ్మ కబుర్లు చెప్పగా, కుప్పే ఇది ఆచరణ సాధ్యం కాదన్నారు. ఇటువంటి శుష్క వాగ్దానాలు చేసిన వ్యక్తిని స్విట్జర్లాండ్‌లో పిచ్చాసుపత్రికి, లేదా జైలుకు పంపిస్తారనడం వాస్తవం. స్వాతంత్ర్యం వచ్చినప్పటి నుంచి నేతలు శుష్క వాగ్దానాలు చేస్తూనే వున్నారు. కాని సాధించిన అభివృద్ధి శూన్యం. ఆచరణ సాధ్యంకాని వాగ్దానాల వల్ల ఈ దుస్థితి దాపురించింది. కుప్పే వాఖ్యల్లో వాస్తవాన్ని ముఖ్యమంత్రి తెలుసుకోకపోగా ఆయనకు అవగాహన లేదని చెప్పడం బాధాకరం. ఇన్‌ఫర్మేషన్ టెక్నాలజీ రంగంలో కర్నాటక, మద్రాస్, కేరళకన్నా మన రాష్ట్రం పెద్ద ముందంజలో లేకపోయినా చంద్రబాబు ప్రచారార్భాటం మాత్రం జాస్తిగా వుంది.

నెల్లూరు — ఎస్.ప్రభాకర్

### ఆర్ఎస్ఎస్ మత సంస్థకాదు

రెండు వారాల క్రితం జమీన్‌రైతు సంపాదకీయంలో రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘ్ గూర్చి తీవ్రవాఖ్యలు చేశారు. ఆర్ఎస్ఎస్‌లో పరమత సహనం లేదు. ప్రతి కల్లోలం వెనుక దాని హస్తం ఉందన్నారు. కాని 75ఏళ్ల చరిత్రగల ఆర్ఎస్ఎస్ ఏటువంటి మతకల్లోలంలోనూ పాలు పంచుకొన్నట్లుగా ఏ కేసులోనూ ధృవీకరించబడలేదు. ఆర్ఎస్ఎస్ హిందూ మతం కోసం పనిచేస్తుందన్నారు. కాని హిందూత్వమనేది ఒక మతానికి సంబంధించినది కాదు. గాంధీజీని హత్యచేసిన గాడ్సే ఆర్ఎస్ఎస్ సభ్యుడు కాదని ధృవీకరించబడింది. ఆర్ఎస్ఎస్ మీద మూడు సార్లు నిషేధం విధించగా, ఆయా సంఘటనల్లో వారి ప్రమేయం లేదని తేలడంతో మళ్లీ నిషేధం ఎత్తివేశారు. ఈ రోజు దేశంలో ఆర్ఎస్ఎస్ ఆధ్వర్యంలో సేవాభారతి, వనవాసి కళ్యాణ ఆశ్రమం వంటి సంస్థలు చేస్తున్న సేవా కార్యక్రమాలు మరే సంస్థ చేయడం లేదు. ఈ సేవా కార్యక్రమాల్లో ఒక మతం వారికే ఆర్ఎస్ఎస్ పరిమితం కాలేదు. అంత వరకు ఎందుకు నెల్లూరులో ఆర్ఎస్ఎస్ నిర్వహించే

తరువాయి [illegible] పేజీలో

# కునుకు లేక, మెతుకులేక మగ్గిపోయారు

మున్సిపల్ ఎన్నికల రాజకీయం పుణ్యమా అని గతవారం రోజులుగా రాజకీయ నాయకులకుకంటికి నిద్ర, కునుకు తిండి కరువైపోయింది. కాంగ్రెస్ పార్టీలో ఎమ్మెల్యే వివేకానందరెడ్డి ఒక్కడే 44వార్డుల్లో కసరత్తులు చేసి, చేసి అలిసిపోయినట్లున్నారు. ముఖ్యంగా 14, 17, 20వార్డులు వివేకా సహనానికి, రాజకీయ చతురతకు పరీక్ష పెట్టాయి. మున్సిపల్ ఎన్నికల నోటిఫికేషన్ వెలువడక ముందు నుంచే పట్టణంలోని అన్ని వార్డులపై ఒక అవగాహనకు వచ్చినా, అలకలు, అసంతృప్తులు, తిట్లు శాపనార్థాలు తప్పలేదు. ఒక పథకం ప్రకారం ప్రణాళికారచన చేసుకొని సాగిపోయారు కాబట్టి కాంగ్రెస్‌లో తిరుగుబాట్ల బెడద దాదాపుగా సమసిపోయింది. తెలుగుదేశం పార్టీలో పరిస్థితి ఇందుకు పూర్తి విరుద్ధంగా ఉంటింది. బిజెపితో సర్దుబాట్ల వ్యవహారం రెండు రోజులపాటు రాత్రింబవళ్లు చర్చల తర్వాతగానీ తేలలేదు. ఆ తర్వాత, తెలుగుదేశం అసమ్మతి గ్రూపుల సమన్వయ కార్యక్రమం మరింత జటిలంగా తయారైంది. అలకలు, మెలికల మధ్య, మంత్రి ఆదాల మధ్యవర్తిత్వంతో, రెండు రోజుల పాటు సంప్రదింపుల తర్వాత, రమేష్‌రెడ్డి అసమ్మతి వర్గంతో సర్దుబాటుకు దిగినా, అసమ్మతికి మాత్రం ఇంకా తెరపడలేదు. కాంగ్రెస్ పార్టీలో అభ్యర్థుల ఎంపిక రాజీల రాజకీయానికి వివేకా ఇల్లు కేంద్రస్థానమైతే, తెలుగుదేశం పార్టీకి సోమశిల గెస్ట్‌హౌస్ నిలయమైంది. అభ్యర్థుల ఎంపికలో జరిగిన కసరత్తు మంత్రి

## అభ్యర్థుల ఎంపికలో నేతల అవస్థలు

ఆదాల ప్రభాకరరెడ్డికి నిజమైన రాజకీయ పాఠాలు నేర్పింది. తన భార్యకు ఛైర్మన్ టిక్కెట్ కోసం కాళ్లావేళ్లా పడ్డ రమేష్‌రెడ్డి, నామినేషన్ తర్వాత, వార్డుల పంపిణీలో ప్రదర్శించిన మొండి వైఖరితో ఆదాల సహా, జిల్లాలో ఆయనకు మద్దతు ఇచ్చిన ఎమ్మెల్యేలు నోరెళ్ల బెట్టారని చెబుతున్నారు.

## కరవుకు 100కోట్ల నిధులివ్వాలి

జిల్లాలో కరవు వాత పడ్డ రైతులు, వ్యవసాయ కూలీలు, ఇతర పేదలను ఆదుకొనేందుకు 100కోట్ల రూపాయల నిధిని కేటాయించాలని సిపిఎం రాష్ట్ర కమిటీ సభ్యుడు టిపి. భానురాజా కోరారు. 18తేది సిపిఎం జిల్లా కమిటీ, జిల్లా రైతు సంఘం, వ్యవసాయ కార్మిక సంఘాల ఆధ్వర్యంలో కలెక్టరేట్ వద్ద జరిగిన ధర్నాలో ప్రజలనుద్దేశించి మాట్లాడారు. జిల్లాలోని నాన్ డెల్టా ప్రాంతమంతా, కరవు తాండవిస్తుంది. త్రాగునీటికి, సాగు నీటికి, పశుగ్రాసానికి ప్రజలు ఇబ్బందులు పడుతున్నారు. నాన్ డెల్టాలోని చెరువుల్లోకి అసలు నీరే రాలేదు. అక్కడక్కడా వేసిన వరి, మెట్ట పైర్లు సైతం నీటి కొరతతో పూర్తిగా ఎండిపోయాయి. కరవులో వ్యవసాయ కార్మికులు వలస

తరువ 11వ పేజీలో

నెల్లూరు మునిసిపల్ ఎన్నికలకు కాంగ్రెస్ అభ్యర్థిగా నామినేషన్ దాఖలు చేస్తున్న డాక్టర్ వల్లంరెడ్డి యశోధర, ప్రక్కన కౌన్సిలర్ రాఘవరెడ్డి.

# గెలిపించండి! నా సత్తాఏమిటోచూపిస్తా!

నెల్లూరు మునిసిపల్ ఛైర్మన్ పదవికి కాంగ్రెస్ అభ్యర్థిగా డాక్టర్ వల్లంరెడ్డి యశోధర పార్టీ కార్యకర్తలు వెంటరాగా, సాదాసీదాగా కాలినడకన వెళ్లి 21తేది నామినేషన్ వేశారు. ఎసి సెంటర్‌లోని వినాయకుని అర్చించి, నామినేషన్ పత్రాలపై దైవ సన్నిధిలో సంతకాలు చేశారు. అనంతరం ఎసి సుబ్బారెడ్డి విగ్రహానికి పూలమాల వేసి వివేకానందరెడ్డి విజయరథం మీద నుండి కాంగ్రెస్ కార్యకర్తల నుద్దేశించి మాట్లాడారు. స్వర్గీయ పుచ్చలపల్లి రామచంద్రారెడ్డి డాక్టర్‌గా, ప్రజానాయకునిగా రెండు బాధ్యతలు సమర్థవంతంగా నిర్వహించారు. నేను అదేబాటన నేను నడవాలని నిర్ణయించుకొన్నాను. డాక్టర్‌గా సామాన్య ప్రజల సమస్యలు, టౌన్ స్థితిగతులు బాగా తెలుసు. మునిసిపల్ ఛైర్మన్‌గా గెలిపిస్తే ఎల్లవేళలా

## కాంగ్రెస్ అభ్యర్థి యశోధర ధీమా!

ప్రజలకు అందుబాటులో వుంటానన్నారు. డిసిసి అధ్యక్షుడు సివి. శేషారెడ్డి మాట్లాడుతూ మేధావి వర్గానికి చెందిన వ్యక్తిని మునిసిపల్ ఛైర్మన్‌గా నిలబెడితే బాగుంటుందని తలచి డాక్టర్ యశోధరను పోటీకి నిలబెట్టాం. ఆమె గెలుపు కోసం కార్యకర్తలు అహరహం శ్రమించాలన్నారు. నెల్లూరు ఎమ్మెల్యే వివేకానందరెడ్డి మాట్లాడుతూ మునిసిపల్ రాజకీయాలకు నూతన నిర్వచనం చెప్పాలని డాక్టర్‌గా ప్రజల సేవలో మమేకమైన యశోధరను పోటీకి పెట్టాం. ఆమె సన్మానాలు, సత్కారాలు, విందులు వినోదాలకు దూరం ప్రచారార్భాటం లేకుండా గడప గడపకు వచ్చి ఓటు అడుగుతుంది. 26తేది ఛైర్మన్, 44 వార్డుల నుంచి పోటీ చేసే కాంగ్రెస్ కౌన్సిలర్లు నీతి, నిజాయితీకి కట్టుబడి ప్రజల కోసం పనిచేస్తామని గాంధీ విగ్రహం దగ్గర

తరువ 11వ పేజీలో

# మాటలురాని మేధావి నా భార్య!

మున్సిపల్ ఛైర్మన్ పదవికి తెలుగుదేశం అభ్యర్థిగా తాళ్లపాక అనూరాధ నామినేషన్ దాఖలు చేసిన అనంతరం, జరిగిన సభలో మాజీ మంత్రి రమేష్‌రెడ్డి తన భార్యకు మాట్లాడడం రాకపోయినా మంచి తెలివిగలిగిందని కితాబు నిచ్చారు. తన సుదీర్ఘ ఉపన్యాసంలో రమేష్‌రెడ్డి కడుపులో బాధనంతా వెళ్లగక్కి కన్నీరు కూడా కార్చారు. నా భార్యను పోటీకి పెట్టను మొదటనాకు ఇష్టం లేదు. నాకు అదృష్టం కలసి రాక ఎమ్మెల్యే టిక్కెట్ రాలేదు, మునిసిపాలిటీ వుందనుకొంటే అదీ మహిళలకు రిజర్వు అయ్యింది. గత్యంతరం లేని పరిస్థితుల్లో మేమిద్దరం మాట్లాడుకొని అనురాధను పోటీకి వప్పించాను. ఆమెకు రాజకీయ దీక్ష పెట్టండి. నాకన్నా బాగా మునిసిపాలిటీని అభివృద్ధి చేస్తుంది. నా భార్యకు మాట్లాడడం చేతకాకపోయినా తెలివి కలది. కుటుంబంలో ముఖ్య నిర్ణయాలన్నీ స్వంతంగా ఆమే ఆలోచించి తీసుకొంటుంది. నేను అనురాధ గెలుపు గూర్చి ఆలోచించడం లేదు. కౌన్సిల్‌లో తెలుగుదేశం పార్టీకి

## నామినేషన్ సభలో రమేష్ కితాబు

బలముండాలి. కార్యకర్తలు 9తేది వరకు ద్విగుణీకృత ఉత్సాహంతో పని చేయాలన్నారు. తాను ఎన్టీఆర్ అభిమానిగా వున్న రోజులు, మునిసిపల్ ఛైర్మన్, ఎమ్మెల్యేగా చేసిన పనుల గూర్చి గంటసేపు రమేష్‌రెడ్డి ఏకధాటిగా ఉపన్యాసం చేశారు.

కంభం విజయరామిరెడ్డి మాట్లాడుతూ 44 వార్డుల్లో తెలుగుదేశం పార్టీ కౌన్సిలర్లను గెలిపించుకోవాల్సిన బాధ్యత తెలుగుదేశం కార్యకర్తలపై వుందన్నారు. ఇళ్లమంత్రి ఆదాల ప్రభాకరరెడ్డి మాట్లాడుతూ జిల్లాలోని మూడు మునిసిపాలిటీలు అభివృద్ధి చెందాలంటే తెలుగుదేశం పార్టీని గెలిపించాలన్నారు. బిజెపి జిల్లా అధ్యక్షుడు సురేష్‌రెడ్డి మాట్లాడుతూ మునిసిపాలిటీలో నిజాయితీగా పనిచేసే వారిని గెలిపించాలన్నారు. నెల్లూరు మునిసిపాలిటీని అభివృద్ధి చేసిన ఘనత రమేష్‌రెడ్డి దన్నారు. వైటి నాయుడు మాట్లాడుతూ రమేష్‌రెడ్డి సతీమణి మునిసిపల్ ఛైర్మన్ కావడం ఖాయం. ఆమె 10వేల ఓట్ల మెజార్టీతో గెలుస్తుందని జోస్యం

తరువ 11వ పేజీలో



# ఎన్నికలహోరులో జనంబాధపట్టదా?

ఎన్నికల పుణ్యమా అని ప్రజా సౌకర్యాల విషయాన్ని మునిసిపల్ అధికారులు గత పదిరోజులుగా పట్టించుకోకపోవడం వల్ల టౌన్‌లో పారిశుధ్యం, మంచినీటి సరఫరా గందరగోళంగా తయారై వుంది. ఎన్నికల విధుల్లో ఊపిరి సలిపే సమయం కూడా లేకుండా పనిచేస్తున్నామని అందువల్ల ఈ దుస్థితి దాపురించిందని అధికారులు చెబుతున్నారు. టౌన్‌లో వారానికి రెండు రోజులు వీధులు, ఒకరోజు కాల్వలను శుభ్రం చేస్తారు. వారానికోసారి చెత్త తొట్లను శుభ్రం చేస్తారు. గత కొన్ని రోజులుగా పై అధికారులు పర్యవేక్షణ లేకపోవడం వల్ల వీధులు, కాల్వలు, చెత్త తొట్లు శుభ్రం చేయడం లేదు. దీనివల్ల చిన్నబజారు, పెద్దబజారు, జెండావీధి, కోటమిట్ట, కుక్కలగుంట, పొగతోట, రామలింగాపురం, బాలాజీనగర్, వెంగళరావునగర్, పోస్టల్, జర్నలిస్ట్ కాలనీల్లో ఎక్కడ చూసిన చెత్త కుప్పలే. మురుగు కాల్వల్లో సిల్టు తీయక

## నెల్లూరుసంగతులు

పోవడం వల్ల 23, 24తేదిల్లో కురిసిన చిన్నపాటి వర్షానికి రోడ్లన్నీ మురుగునీటి మయమయ్యాయి. వెలగని వీధి దీపాల గూర్చి పట్టించుకోక పోవడంతో ఇప్పుడిప్పుడే ప్రచారానికి వెళ్తున్న నాయకులను,ప్రజలు ఈ విషయమై నిలదీస్తున్నారు. కౌన్సిలర్ల టిక్కెట్లను అతి కష్టం మీద తెచ్చుకొన్న నాయకులు మరో గత్యంతరం లేక తమ స్వంత డబ్బులతో లైట్లు, చోకులు కొని కొన్ని చోట్ల వేయిస్తున్నారు. రెవిన్యూ సిబ్బంది ఎటువంటి కలక్షన్లు చేయక పోవడం వల్ల ఫిబ్రవరి నెల జీతాలు మునిసిపల్ సిబ్బంది ఇంత వరకు తీసుకోలేదు. మునిసిపల్ ఎన్నికల్లో పోటీ చేసిన నేతలు చెల్లించిన ధరావత్తులు, వారి ఇళ్ల పన్నులు, ఇతర బకాయిలు 5లక్షలపైబడి రాగా వాటిలో నుంచి అత్యవసరమని ఎన్నికల కోసం ఖర్చు పెడుతున్నారు. ఎన్నికల సమయాన ఇళ్ల, నీటి పన్నుల వసూళ్లు తీవ్రతరం చేయను వీలులేక కమీషనర్, మేనేజర్ జీతాలడిగిన

తరువ 11వ పేజీలో

# ఆఫీసుల్లో 'మందు' బాబుల చిందులు

అనంతసాగరం మండలంలోని ప్రభుత్వ కార్యాలయాలు బార్లుగా మారిపోయాయి. వ్యసనపరులైన కొందరు ఉద్యోగస్తుల వల్ల ప్రజల సేవకు అంకితం కావలసిన కార్యాలయాలు మందుబాబుల సేవకు అంకితమైపోయాయి. మండల అభివృద్ధి అధికారి విశ్రాంతి తీసుకొనే మందిరాన్ని గ్రామస్థాయి నాయకులు, అధికారులు కలసి బారుగా మార్చేశారు. సమయం సందర్భం లేకుండా ఇక్కడ మద్యాన్ని సేవిస్తుండడం వల్ల వివిధ పనుల మీద మండల కార్యాలయానికి వచ్చే ప్రజలు సమస్యలు ఎదుర్కొంటున్నారు. మండలాధ్యక్షుడు గ్రామస్థాయి నాయకులకు మద్దతు నిస్తుండడంతో మండల అభివృద్ధి అధికారి పల్లెత్తు మాట అనడం లేదు. ఇక్కడ మందుబాబులకు మద్యం సరఫరా

## అనంతసాగరంలో సర్కారీ అరాచకం

చేసి మిగిలిన మద్యం తాగి ఎమ్మార్వో కార్యాలయంలోని అటెండర్ ప్రతిదినం వీరంగం సృష్టిస్తున్నాడు. ప్రభుత్వాసుపత్రిలోని ఎవిహెచ్‌ఎస్ మద్యం తాగడం కోసమే రాత్రిపూట ఇక్కడ ఆగిపోతున్నారు. దీంతో నైట్ డ్యూటీ చేసే ఎ.ఎన్.ఎంలు ప్రాణాలు అరచేతిలో పెట్టుకొని పనిచేస్తున్నారు. జిల్లా వైద్య ఆరోగ్యశాఖాధికారి ఈ అధికారిని ఇక్కడ శయనించవద్దని చెప్పినా ఈ అధికారి ఖాతరు చేయడం లేదని తెలుస్తుంది. ప్రభుత్వ కార్యాలయాలను బార్లుగా మార్చేసిన అధికారుల ప్రవర్తనను ఉన్నతాధికారులు పరిశీలించాల్సిన అవసరం లేదంటారా?

## మంచినీటిని కొంటున్న ఎ.ఎస్.పేట ప్రజలు

పుణ్యక్షేత్రమైన ఎ.ఎస్.పేటలో ప్రజలు

తొరవ 8వ పేజీలో

గూడూరు మునిసిపల్ ఎన్నికల ప్రచారంలో కాంగ్రెస్ అభ్యర్థి డాక్టర్ విజయలక్ష్మి, ప్రక్కన నేదురుమల్లి పద్మనాభరెడ్డి, వేమారెడ్డి వెంకటకృష్ణారెడ్డి

# నిమ్మరైతులపై కరవు వేటు

గూడూరు డివిజన్‌లోని నిమ్మరైతులు ఎప్పుడూ లేనన్ని కష్టాలు పడుతున్నారు. కరవుతో తల్లడిల్లిన రైతులకు విద్యుత్ కోత మరింత ఇబ్బందిని కలిగిస్తోంది. వర్షాలు లేక బావుల్లో పిల్లబావులు త్రవ్వి పంటను పండిస్తే కాయలకు గిట్టుబాటు ధరలేదు. గతంలో వెయ్యి రూపాయలు పైబడి ఉత్తరాదిలో రేటు పలుకుతుండిన నిమ్మకాయల బస్తా ప్రస్తుతం 400లకు మించి పలకడం లేదు. గతంలో నెల్లూరు జిల్లాలోని గూడూరు ప్రధాన కేంద్రంగా ఉత్తరాదికి నిమ్మకాయలు ఎగుమతి అయ్యేవి. ప్రస్తుతం తెలంగాణా, గుజరాత్ రైతులు కూడా ఈ పంటపై దృష్టి కేంద్రీకరించడంతో డిమాండ్ పడిపోయింది. గతంలో వెంకటగిరి నుంచి 12 టన్నుల వరకు హౌరా ఎక్స్‌ప్రెస్‌లో ఎగుమతి అవుతుండిన నిమ్మకాయల బస్తా కోటాను ప్రస్తుతం 4టన్నులకు కుదించడం వల్ల స్థానిక మార్కెట్‌లోనే రైతులు నిమ్మకాయలు అమ్ముకోక తప్పడం లేదు.

## జిల్లావార్తలు

## ఆలస్యంగా పుట్టింటికి వచ్చిన ఎమ్మెల్యే

ఆత్మకూరు నియోజకవర్గంలో తన అనుమతి లేకుండా కాలు పెట్టకూడదని మాజీ ఎమ్మెల్యే హుకుంతో ఎమ్మెల్యే డాక్టర్ రాజేశ్వరమ్మ గెల్చాక తన స్వగ్రామానికి కూడా వెళ్లే ధైర్యం చేయలేక పోయారు. ఇటీవల తన పంతాన్ని తగ్గించుకొని కాస్త మెత్తబడడంతో లక్ష్మయ్యనాయుడుతో కలసి అనంతసాగరం మండలంలోని ఆమె స్వగ్రామం ఇస్కపల్లి వెళ్లి కాసేపు గ్రామస్తులతో గడిపి వచ్చారు. ఎన్నికల సమయం సైతం రాలేదు. సమస్యలుంటే చెప్పండి పరిష్కరిస్తానంటే... ఒక్కరు ఒక్క సమస్య గూర్చి ప్రస్తావించలేదు. ఎమ్మెల్యే అంటే స్వగ్రామస్తులకు మరీ లెక్కలేనట్లుందే!

## మాయమవుతున్న కిరోసిన్

తోటపల్లి గూడూరు మండలంలోని

తొరవ 8వ పేజీలో

# చీకటి బజారుకు రేషన్ బియ్యం

ఆత్మకూరులోని రేషన్ షాపుల ద్వారా పంపిణీ చేయాల్సిన బియ్యం బ్లాక్‌మార్కెట్‌కు తరలిపోతున్నాయి. డీలర్లు, రైసు మిల్లర్లతో కుదుర్చుకున్న ఒప్పందం మేరకు ఆత్మకూరుకు బియ్యం బస్తాలు రాగానే 75శాతం మేర మిల్లుల్లోనే స్టాక్ పెట్టేస్తున్నారు. మిగతా 25 బస్తాలను మాత్రమే షాపుల్లో ఒకటి, రెండు రోజులు పంపిణీ చేస్తున్నారు. మిల్లర్లు బస్తాను 550 రూపాయలకు కొంటున్నందున డీలర్లకు బస్తాకు 250లకు పైగా లాభమొస్తుండడంతో ఈ వ్యాపారం జోరుగా సాగిపోతుంది. కొందరు డీలర్లు బియ్యాన్ని తామే మిల్లుల్లో పాలిష్ పెట్టించి బయట బియ్యం వ్యాపారం చేసుకొంటున్నారు. నెలలో చివరి రోజు రేషన్ షాపుల్లో బియ్యం ఇచ్చి కోటా అయ్యిందని ప్రకటిస్తున్న డీలర్లపై విజిలెన్సు శాఖ అధికారులు ఆకస్మిక దాడులు చేస్తే ఫలితముంటుంది.

## పట్టించుకొనే నాధుడేడి?

## 6 నెలలుగా గ్రంథాలయం మూత

రాపూరు టౌన్‌లో గత ఆరు నెలలుగా గ్రంథాలయం మూత పడివున్నా పట్టించుకొనే

తొరవ 8వ పేజీలో

# నెల్లూరు మున్సిపల్ ఎన్నికలు

[illegible]

## కలహాల వార్డుల్లో కల్లోలం రేగింది!

నెల్లూరుటౌన్‌లో కాంగ్రెస్ తెలుగుదేశం పార్టీలు రెండింటిలోనూ పేచీలుండిన వార్డుల్లో రాజీలు జరగలేదు. ఈ రోజు మధ్యాహ్నం నామినేషన్ల విత్‌డ్రాయల్స్ చివరి నిమిషం వరకు ఈ శిబిరంలో ఆనం వివేకానందరెడ్డి, ఆ శిబిరంలో రమేష్‌రెడ్డి రకరకాల కసరత్తులు చేసినా ఫలించలేదు.

తెలుగుదేశం 39వార్డులో చివరి క్షణంలో తమ అభ్యర్థి మొహిద్దీన్‌ను మార్చి, ప్రభాకరరెడ్డి అనే వ్యక్తికి ఇవ్వడంతో జిల్లా వక్ఫ్‌బోర్డు అధ్యక్షుడు పమ్మి మునిసిపల్ ఆఫీసును ధ్వంసం చేశాడు. బీ ఫారాలు సమర్పించడానికి ఆఫీసుకు వచ్చిన రమేష్ రెడ్డిపై దాడికి ప్రయత్నించారు. కమీషనర్ వెంటనే పోలీసును పిలిపించుకొని, తన ఆఫీసును రక్షించుకొన్నాడు. అప్పటికే బోర్డులు పగిలిపోయాయి.

5వార్డులో వైటి. నాయుడు క్యాండిడేట్‌కు సీటు ఇచ్చినందుకు నిరసనగా రమేష్ రెడ్డి అంతరంగికుడు ఏ.శ్రీనివాసులు రెబల్ నామినేషన్ వేశాడు; రెండవ వార్డులో చంద్ర అనే తెలుగుదేశం కార్యకర్త తిరుగుబాటు బావుటా ఎగురవేస్తున్నారు.

మొత్తం మీద టిక్కెట్ల పంపకంలో పూర్తిగా వెుండి చెయ్యి ఎదురైనవారు - వైవి.రామిరెడ్డి, వర. వి.టి. రంగరాజన్. వీరి వైఖరి ఎట్లా వుంటుందో రెండు రోజులు గడిస్తేకాని అర్థం కాదు.

కాంగ్రెస్‌కు సంబంధించి 17వార్డులో పెద్ద పేచీ ఎదురైంది. కలవకూరు విజయశేఖరరెడ్డి, పింది సురేష్‌ల మధ్య తీవ్రమైన పోటీ. ఎటూ తేల్చుకోలేక సతమతమైనారు. తనకు టిక్కెట్ ఇవ్వకుంటే సహించేది లేదని బెదరించాడు విజయశేఖరరెడ్డి; పింది సురేష్‌ను నుంచి కూడా అటువంటి హెచ్చరికే వచ్చింది. త్రాసులో విజయ బరువు ఎక్కువ తూగడంతో - టిక్కెట్ అటే వెళ్లింది. సురేష్ ఇండిపెండెంట్‌గా రంగంలోకి దిగాడు.

14వార్డులో పసుపులేటి వెంకటేశ్వర్లును నలిపి నలిపి టిక్కెట్ ఇచ్చారు. అయితే స్థానికంగా వుండే ఆనం అనుచరులందరూ దాన్ని అంగీకరించలేదు. మహిళా కాంగ్రెస్ నాయకురాలు బివి. లక్ష్మి, ఆనం వారి స్వంత అనుచరుడు చక్రవర్తి - ఇద్దరూ ఆశపడిన వార్డు ఇది. లక్ష్మికి టిక్కెట్ ఇవ్వమని సాక్షాత్తు నేదురుమల్లి రాజ్యలక్ష్మమ్మ సిఫార్సు చేసినా వివేకా అంగీకరించలేదు. ఇక్కడా స్వతంత్ర అభ్యర్థి పోటీ తప్పదు.

10వార్డులో చేవూరు దేవకుమారరెడ్డి అనుచరుడు శ్రీధర్‌రెడ్డికి మొదట టిక్కెట్ ఇచ్చారు. కానీ తన కోటాలోకి 37వార్డు కూడా ఇవ్వమని అడిగాడు దేవకుమార్; వివేకా అందుకు అంగీకరించక పోవడంతో అలిగి 10వార్డు నుంచి శ్రీధర్‌రెడ్డిని ఉపసంహరింపజేశాడు. చివరి క్షణంలో డమ్మీ అభ్యర్థిగా నామినేషన్ వేసి వుండిన మేకల రమణయ్య అనే వ్యక్తికి టిక్కెట్ ఇచ్చి - కాంగ్రెస్‌కు అభ్యర్థి దొరకలేదు అనే అప్రతిష్ఠ లేకుండా చేసుకున్నారు. ఇది తెలుగునేత శ్రీధరకృష్ణారెడ్డి పోటీ చేస్తున్నవార్డు; అక్కడ ఇంత కల్లోలం అంటే ఆ వార్డులో ఆయన కష్టపడకుండా పళ్లెంలో పెట్టి ఇచ్చినట్లు లెక్క.

## ప్రభాకరరెడ్డి ముఖం తప్పించాడా?

జిల్లా మంత్రి ఆదాల ప్రభాకరరెడ్డి 24తేది ఉదయం నెల్లూరు రావలసింది; కానీ రాలేదు. కారణం -కౌన్సిలర్ల టిక్కెట్ల బీ ఫారాల పంపిణీలో రచ్చలు భరించలేక పోవడమేనని వార్త. ప్రభాకరరెడ్డి సౌమ్యుడు; మంచి మాటలతో వ్యవహారం చక్కబెట్టుకోవడం ఆయనకు తెలిసిన విద్య. మునిసిపల్ రాజకీయాలలో ఆ మాట మంచితనం ఏ మాత్రం పనిచేయలేదు. ఎవరి నోరు తెరిచినా మురికి రాజకీయం కంపు. దాన్ని భరించలేక ముఖం తప్పించేసినట్లున్నాడు.

## ఆడవాళ్లు తక్కువ

కొత్త ఓటర్ల చేరిక తర్వాత నెల్లూరు మునిసిపల్ ఓట్ల సంఖ్య 2లక్షలా 95వేల 528కి చేరింది. ఇందులో మగవాళ్లు లక్షా 32వేలా 324; ఆడవాళ్లు లక్షా 24వేలా 204 మంది! మహిళలకు రిజర్వు అయిన మునిసిపాలిటీలో మహిళా ఓటర్ల సంఖ్య తగ్గడం విశేషం.

## నిప్పో పెళ్లి

నిప్పో ఫ్యాక్టరీ అధినేత, నెల్లూరు పారిశ్రామిక పటం నుంచి అదృశ్యం కాకుండా నిల్పిన పారిశ్రామికవేత్త, కోట్లకు పడగలెత్తినా కల్లాకపటం లేకుండా అందరితో కలివిడిగా వుండే సౌజన్య శీలి, మనిషి ఎంత పొడగరో, మనసూ అంతే ఉన్నతంగా వుంచుకోగల్గిన స్నేహపాత్రుడు - నెల్లూరుజిల్లా వాసి కాకున్నా నెల్లూరే తన స్వంత వూరుగా భావించే మిత్రులు శ్రీ పి. ఓబులురెడ్డి గారి మనుమరాలి పెళ్లి 14తేది సాయంత్రం మద్రాసు రాణి మెయ్యమ్మ కళ్యాణ మండపంలో జగజ్జగేయమానంగా జరిగింది. వధువు - ఓబులరెడ్డిగారి తనయ మీనా కుమార్తె వైష్ణవి. వరుడు - మాజీ ఎమ్పీ, కాంట్రాక్టుల కుబేరుడు, స్వయంకృషితో అంచెలంచెలుగా ఎదిగిన శ్రమజీవి శ్రీ మేకపాటి రాజమోహన్ రెడ్డి తనయుడు విక్రమ్. పెళ్లికి మద్రాసేకాక, మొత్తం దక్షిణ భారతదేశ పారిశ్రామిక కులీనులందరూ తరలివచ్చారు. రామయ్య, ఎం.ఎ.ఎం. రామస్వామి, వి.ఎల్. దత్, టిఎంసి నేత మూపనార్, ఛీఫ్ సెక్రటరీ కుప్పుస్వామి, హైకోర్టు న్యాయ మూర్తులు, సినీ ప్రముఖులు వంటి వారితో మండపం కళకళలాడింది. రాజమోహన్‌రెడ్డి గారు ఉదయగిరి ఓటర్లందరినీ తరలించి నట్లున్నారు. అంత పెద్ద మండపంలో కాలు చేయి కదపడానికి వీలు కాలేదు. ఈ నూతన జంటకు మా శుభాకాంక్షలు.

## గూడూరు

7వ పేజీ కొరవ

ఇంతటి కలహాల కాపురంలో సుఖము, శాంతి వుంటాయని ఆశించడం ఎట్లా? కానీ తెలుగుదేశం లుకలుకలను తమ రాజకీయ లాభంగా మలచుకోవడంలో కాంగ్రెస్ చతికిలబడి పోతుండడం వారి అదృష్టం.

## నెలవంకలు

10వ పేజీ కొరవ

ప్రేమలోని నవరసాలను, నరసాలను పరాగాలుగా మనకు అందించిన ఆత్రేయలో గొప్ప విప్లవకారుడున్నాడు. తోడికోడళ్లు చిత్రంలో "కారులో షికారుకెళ్లే పాల బుగ్గల చిన్నారిదానా" అన్న పాటలో సంపన్నుల సిరిసంపదలు, అందచందాల వెనక, శ్రమజీవుల కష్టజీవితాలను కళ్లకు కట్టినట్లు చూపించిన విప్లవకవి ఆత్రేయ. "పాలరాతి మేడలోన కులుకుతున్న చిన్నదానా" అంటూ, ఆ పాలరాతి మేడకట్టిన కష్టజీవుల బాధలను హృద్యంగా వర్ణించాడు.

దైవం, మతం వ్యక్తిగత నమ్మకాలు వాటికి ప్రజాజీవితంలో చోటు లేదనే ఆత్రేయ దేవుడనేవాడు ఉన్నాడనుకుంటే ఉన్నవాళ్లకు ఆటబొమ్మ, లేనివాళ్లకు అంతరాత్మ అంటూ నగ్న సత్యాన్ని చెప్పాడు. భయంవల్ల దేవుడు ఉన్నాడని పూజించడం కంటే, నిర్భయంగా దేవుడు లేడనడం ఉత్తమం. అన్న ఆత్రేయ, వ్యక్తిగత ఆస్తి కూడ పెట్టుకోవడాన్ని చీదరించు కొనేవాడు. దేవుడున్నాడా లేదా అన్నవాదన తనకు అనవసరమని, పోతనలాగే "దేవుడు కలడో లేడో" అన్నదే తన సిద్ధాంతమని చెప్పిన ఆత్రేయ వెంకటేశ్వర మహత్యం సినిమాలో "శేషశైలవాస శ్రీ వెంకటేశా" అంటూ ప్రజలను భక్తి పారవశ్యంలో ముంచే అద్భుతమైన పాటను రాశాడు. అదే పాటలో శ్రీవారి ప్రేమలీలను కూడా వర్ణిస్తూ " శ్రీదేవి వంకకు చిలిపిగా చూడకు, అలమేలు మంగకు అలుకరానీయకు, ముద్దు సతులిద్దరినీ ఇరువైపులా చేర్చి, మురిపించి లాలించి ముచ్చటలు తీర్చి" అంటూ భక్తిభావం నుంచి, మన మనసులను ప్రేమతత్వం వైపు మళ్లించిన మనసుకవి ఆత్రేయ.

తాను పట్టిపెరిగిన సూళ్లూరుపేట తాలూకాలోని మంగళంపాడు పక్కనే ఉన్న మన్నారుపోలూరులో చిన్ననాటి జ్ఞాపకాల్లో 'ఆటవెలది' పేరుతో రాసిన పద్యంలో ఆనాటి వేశ్యల ప్రాభవాన్ని ఆత్రేయ ఎంతో చక్కగా వర్ణించారు.

*విప్రవీధివెన్క వెలయువేశ్యావీధి*
*విలువ తేలని సొగసులకు ప్రోది*
*నృత్య సంగీత సాహిత్యకళావేది*
*రసికపండిత కవిరాడ్వినోది*
*దైవకైంకర్య సద్ధర్మపాలనమోది*
*నిజవృత్తి నర్తన నియమవాది*
*శృంగార నైశిత్యరాశిరసనిధి*

అంటూ నాటి మన్నారు పోలూరు గ్రామంలో వేశ్యాగృహాలను వర్ణించారు.

400 చిత్రాలకు పైగా పాటలు రాసి, ఆంధ్రదేశంలో ఆబాల గోపాలాన్ని ఊరించి, ఉడికించి, ఏడిపించిన ఆత్రేయ 1989 సంవత్సరం సెప్టెంబరు 13తేది మరణించారు. మృత్యువు దరిచేరుతుండగా "వెళ్తున్నాను" అనే కవితలో ఆత్రేయ తన ఆత్మఘోషను వివరించాడు.

*నేనిచ్చినదే తక్కువ*
*నే తీసుకున్నదెక్కువ*
*తెల్లారే లోపుగానే*
*వెళ్లాలి జగతివిడచి*
*వెలుగులో ఈ జగతి చూస్తే*
*వెళ్లను కాల్లాడవు*

అంటూ రాసి నిజంగానే తెల్లారకుండానే మనల్ని వదిలి తిరిగిని లోకాలకు తరలిపోయాడు. చనిపోయిన తర్వాత "శరీరం వట్టి బొంది అని దాని మీద మాలలు వేస్తే మంటలు తింటాయి" అంటూ తన మీద తానే జోకువేసుకున్నాడు.

ఆత్రేయ గతించి దశాబ్దం దాటింది. ఆయన లేకపోయినా ఆయన పాట ఉంది. మనిషికి మనసు ఉన్నంతకాలం ఆత్రేయ సజీవుడే. ఆయన పాట వింటూ ఆయననే స్మరిస్తూ, ఆయన మరణాన్ని విస్మరిస్తాం. అందుకే ఆత్రేయ గొప్పకవి. మనసుకవి. మూగమనసులు చిత్రంలో ఆత్రేయ ఒక పాటలో "పోయినోళ్లందరూ మంచోళ్లు, ఉన్నోళ్లు పోయినోళ్ల తీపిగురుతులు" అంటూ రాశారు. ఆత్రేయ విషయంలో మాత్రం ఇది అబద్ధం.

పోయిన ఆత్రేయ మంచి వాడేకానీ ఆయనకు తీపిగుర్తుగా ఉన్నవాళ్లలో ఎవరూ లేరు. ఆ మహాకవి మనసులో పుట్టి కలం నుంచి జాలువారిన ఆణిముత్యాల్లాంటి పాటలే గతించిన ఆత్రేయ తీపిగుర్తులు. నెల్లూరు చరిత్రలో కవితా భరణాలు మనందరికీ గర్వకారణాలు.

## కావలి మునిసిపాలిటీలో పోటీలో వున్న అభ్యర్థులు

| | కాంగ్రెస్ | తె.దే/బిజెపి |
|---|---|---|
| 1వార్డు | వావిళ్ల మల్లీశ్వరమ్మ | సన్నబోయిన రమణమ్మ |
| 2వార్డు | రామమోహనరెడ్డి | చక్కా నరసింహం |
| 3వార్డు | ఓ.శ్రీనివాసులు | కూరపాటి కొండారెడ్డి |
| 4వార్డు | అనుమాలశెట్టి విజయలక్ష్మి | కందుకూరి పుష్పవతి (బిజెపి) |
| 5వార్డు | మద్దినేని శ్రీనివాసులు | ఉప్పాల వెంకయ్య |
| 6వార్డు | తోట లావణ్యకుమారి | పూనూరు శిరీష |
| 7వార్డు | ఇనాయత్ హుస్సేన్ | షేక్ షాహుల్ |
| 8వార్డు | నవాబ్‌ఖాన్ | సర్దార్ |
| 9వార్డు | మొలతాటి హేమలత | ఆత్మకూరు కోటేశ్వరమ్మ |
| 10వార్డు | బక్కాజాన్ | పర్వతరెడ్డి వెంకటసుబ్రహ్మణ్యం |
| 11వార్డు | సిహెచ్. రావమ్మ | సన్నికంటి విజయలక్ష్మి (బిజెపి) |
| 12వార్డు | కుమ్మరగుంట సరోజనమ్మ | పాలడుగు అనూరాధ |
| 13వార్డు | షేక్. హసీనాబేగం | సయిదున్నీసా |
| 14వార్డు | డేవిడ్ ప్రేమకుమార్ | జట్టి విజయకుమార్ |
| 15వార్డు | సున్నా వెంకట్రావు | మాచర్ల రమేష్ (బిజెపి) |
| 16వార్డు | కనమర్లపూడి నారాయణ | నాగసూరి సురేష్ |
| 17వార్డు | మల్లి ఆంజనేయులు | పల్లపు చిట్టిబాబు (బిజెపి) |
| 18వార్డు | కంచర్ల వెంకట సత్యనారాయణ | నెరెళ్ల జ్వాలాసుబ్రహ్మణ్యం |
| 19వార్డు | మన్నెపల్లి శ్రీనివాసులు | గోదావరి రమణమ్మ |
| 20వార్డు | చేవూరి తిరుపాలు | సుకుమార్ |
| 21వార్డు | షేక్ మునీర్ | కుట్టుబోయిన రాజా |
| 22వార్డు | ఓగిరి రమమ్మ | పాలకీర్తి వరలక్ష్మమ్మ |
| 23వార్డు | చలంచర్ల దేవసేన | కర్రెద్దుల ఆనందరావు |
| 24వార్డు | బండ్లమూడి మాల్యాద్రి | పల్లేరు చంద్రశేఖర్ |
| 25వార్డు | కుందుర్తి మాధవి | గోళ్ల సుగుణ |
| 26వార్డు | జి.వి.రాజకుమార్ | మందాటి మాలకొండయ్య |
| 27వార్డు | బెజవాడ లక్ష్మినరసయ్య | కొమరా రమణయ్య |
| 28వార్డు | సమాధి సునీత | మేకా పద్మావతి (బిజెపి) |

# పాత్రధారులు సిద్ధం - సూత్రధారులు మాయం!

జిల్లాలోని తతిమా రెండు మునిసిపాలిటీలలో అభ్యర్థుల నిర్ణయమే జరగక అనిశ్చిత స్థితి నెలకొని వున్నా - కావలిలో మాత్రం అంతా ప్రశాంతంగా జరిగిపోతున్నది. ఇక్కడ ఒకటి, అరా చిటి లేకపోలేదు. కాని తతిమా రెండింటితో పోలిస్తే లెక్కించదగింది కాదు.

తెలుగుదేశం ఛైర్మన్ అభ్యర్థి కేతిరెడ్డి రామకోటారెడ్డికి వెన్నుదన్ను కల్పించడానికి పెద్ద సైన్యమే దిగుతున్నది కావలికి! మాజీ మంత్రి సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి రానున్న పదిహేనురోజులూ కావలిలోనే మకాం పెడతానని చెప్పారట. తెలుగుదేశం కోశాధికారి, రాజ్యసభ సభ్యుడు పర్వతనేని ప్రభాకరరెడ్డి కూడా రాబోతున్నారు. వీరిద్దరూ రామకోటారెడ్డికి దగ్గర బంధువులు.

అయితే అసలు కథ నడిపించవలసిన ఎమ్మెల్యే వేణుగోపాలరెడ్డి మాత్రం ఎందువల్లనో అంటీముట్టనట్టు వ్యవహరిస్తున్నారు. రామకోటారెడ్డి నామినేషన్‌కు ఆయన గైర్హాజరు కావడంతో పలు సందేహాలు తలెత్తుతున్నాయి. అయితే ఇవి నిజమని భావించలేము. వేణుగోపాలరెడ్డికి, రామకోటారెడ్డికి మధ్య వైరుధ్యాలేవీ లేవు. అసెంబ్లీ ఎన్నికల్లో ఇద్దరూ కలిసే తిరిగారు. ఈలోగా తగవులు, తంటాలు రాలేదు. పైగా రామకోటారెడ్డికి టిక్కెటివ్వాలని తీసుకున్న నిర్ణయంలో వేణుగోపాలరెడ్డి ప్రమేయమూ వుంది. మంత్రి ఆదాల ప్రభాకరరెడ్డి అంగీకారం వుంది. వేణుగోపాలరెడ్డికి ఇష్టం లేనిపని ప్రభాకరరెడ్డి చేస్తే చేయడు. వారిద్దరికీ అంత దోస్తీ! అందువల్ల కాకతాళీయంగా జరిగిన ఒకటిరెండు సంఘటనలకు పెడర్థాలు తీయడం తప్ప రామకోటారెడ్డి అభ్యర్థిత్వంపై అపార్థాలు, అసూయలు వున్నాయనడం నిజం కాకపోవచ్చు.

కావలిలోని తతిమా తెలుగునేతలు - గొట్టిపాటి కొండపనాయుడు, ఎమ్మిగ్వా రామిరెడ్డి, నాయుడు రామ్‌ప్రసాద్, డాక్టర్ ప్రభాకరనాయుడు తదితరులంతా గురుశిష్య సంబంధం; కాని ఇప్పుడా బంధం పల్చబడింది. ఇద్దరి మధ్య మనస్పర్థలున్నాయని చెప్పలేముగాని, మనసు విప్పి మాట్లాడుకొనే పరిస్థితి మాత్రం లేదు. దీనికి తగ్గట్టె నామినేషన్ నాటి నుంచి యానాదిరెడ్డి గారు కావలి ముఖం చూడలేదు. మద్రాసులో మకాం పెట్టి వున్నారు. అనారోగ్యం కారణమని చెప్తున్నారు. అదే నిజమైతే ఇబ్బంది లేదు కాని, అది కేవలం సాకు, అయితే మాత్రం ఎన్నికల ప్రచారంలో ఎగుడు దిగుడులు తప్పవు.

## కావలి మునిసిపల్ ఎన్నికల రాజకీయం

రామకోటారెడ్డిని మనఃస్ఫూర్తిగా సమర్థిస్తున్నారు. కావలి తెలుగుదేశం రాజకీయాలలో ఇంతటి ఏకీభావం, ఐక్యత ఇంతకు మునుపెప్పుడూ లేదు. ఈ పరిణామం - రామకోటారెడ్డికి కలిసి వచ్చిన అదృష్టం క్రింద లెక్క. వ్యక్తిగా ఆయనకు కావలిలో చాలా మంచి పేరు వుంది. సౌమ్యుడు, స్నేహపాత్రుడు, వివాదరహితుడు అన్న మన్నన వుంది. ఈ సుగుణాలకు - తెలుగుదేశం పార్టీబలం, నేతల అండదండలు లభించడంతో రామకోటారెడ్డి ఎన్నికల బండి నల్లేరుపై నడిచిపోతున్నది.

కాంగ్రెస్ అభ్యర్థి గ్రంధి యానాదిశెట్టి గారిది ఇందుకు విరుద్ధ పరిస్థితి. ఆయనకు వుండే ఏకైక నాయకుడు కలికి యానాదిరెడ్డి గారు; పూర్వాశ్రమంలో ఇద్దరిదీ విడదీయరాని

### పనిచేయడమే విమర్శలకు కారణమైంది

అభ్యర్థిగా యానాదిశెట్టికి ప్రధాన అనుకూలత - గత పదేళ్లుగా కావలి మునిసిపల్ రాజకీయాలను పర్యవేక్షించిన అనుభవం! రెండు దఫాల నుంచి ఆయన వైస్ ఛైర్మన్. కాంగ్రెస్ కౌన్సిలర్లందరి అవసరాలూ ఆయనే తీరుస్తుండినాడు. ప్రతి రోడ్డులోనూ ఏదో ఒక పని చేయించినాడు. జన్మభూమి సిమెంట్ రోడ్లు వేయడంలో ఆనయకు రాష్ట్రంలోనే ప్రథమ స్థానం లభించింది. ఏ ఇంటి ముందు ఆగినా ఆ ఇంట్లోని వారు యానాదిశెట్టిని గుర్తుపడతారు; యానాదిశెట్టి వారిని పేరు పెట్టి పలకరించగల్గుతాడు.

అయితే ఈ పురపాలనానుభవం మరొక రకంగా అననుకూలతగానూ పరిణమిస్తున్నది. కావలి మునిసిపాలిటీ అవినీతి ఖనిగా మారడానికి, అప్పుల వూబిలో కూరుకుపోవడానికి ఆయన ప్రత్యక్ష, పరోక్ష ప్రమేయాలు వున్నాయన్నది ఒక విమర్శ. కాచే చెట్టుపైనే రాళ్లు పడడం ప్రకృతి ధర్మం. పని చేసిన వాడినే జనం విమర్శించడం సహజం.

ఒకప్పుడు వైశ్య కులం యావత్తు యానాదిశెట్టి గుప్పెటలో వుండేది; ఇప్పుడు వారిలోనూ ఆయన పట్ల అసూయ ఉత్పన్నమై వుంది. ఏ పని చేయకుండా తన గురువు యానాదిరెడ్డి వలె మాటలతో కాలక్షేపం చేసి వుంటే ఇప్పుడు యానాదిశెట్టికి చీకాకులే వుండేవి కావు. పనులు చేసిపెట్టి సమస్యలు కొని తెచ్చుకున్నారు.

కావలి టౌన్‌లో వైశ్యుల సంఖ్య చాలా ఎక్కువ. అయినా తమకు రాజకీయ ప్రాధాన్యత లేకుండా పోతున్నదని వారు గునుస్తుండేవారు; ఇప్పుడు అవకాశం కలిసివచ్చింది. కలిసి పనిచేస్తారో, కలహం మరొని తమలో తాము కల్లోలానికి గురౌతారో వేచి చూడాలి.

### బిజెపి అభాసుపాలు

కావలి మునిసిపాలిటీలో అగుడు పట్టిపోయిన పార్టీ బిజెపి ఒక్కటే! పది వార్డులు అడిగారు వారు; ఆరు సాధించుకున్నారు. కాని తీరా చూస్తే వాటికి అభ్యర్థులు దొరకలేదు. బజారంతా భిక్షమెత్తినట్లు తిరిగి ఐదింటిలో మాత్రం వెతికి పట్టుకోగలిగారు. తమకు అలయెన్స్‌లో వచ్చిన ఆరవ స్థానం అభ్యర్థి దొరకక వెనక్కు తిరిగి ఇచ్చేయవలసి రావడం కంటే అవమానం ఇంకొకటి వుండదు. ఇంకొక ప్రక్క బిజెపి టౌన్ అధ్యక్షుడు ఐదు స్థానాలలోనూ రెబల్ అభ్యర్థులను నిలిపాడు. ఆయన, గ్రంథియానాదిశెట్టి వియ్యంకులు; అందువల్ల బిజెపి ఓట్లు చీల్చి యానాదిశెట్టి గెలుపు సాధించడం ఈ రెబల్ నామినేషన్ల లక్ష్యం. ఒక పార్టీగా బిజెపి ఎంత భ్రష్టు పట్టిపోయిందంటే!*

## నెల్లూరు కౌన్సిల్ అభ్యర్థుల జాబితా

నెల్లూరు మునిసిపల్ కౌన్సిల్ ఎన్నికలలో పోటీ చేస్తున్న రెండు ప్రధాన పార్టీల అభ్యర్థుల జాబితా దిగువ ఇస్తున్నాము.

| | కాంగ్రెస్ | తె.దే / బిజెపి |
|---|---|---|
| 1వార్డు (ఎస్‌సి మహిళ) | బక్కా భూదేవమ్మ | పదాల జయకుమారి |
| 2వార్డు (ఒసి) | పఠాన్ మహబూబ్‌బాషా | నున్నా వెంకటసురేంద్ర |
| 3వార్డు (బిసి మహిళ) | బండి కస్తూరిదేవి | ఎన్. ప్రసాదిని (బిజెపి) |
| 4వార్డు (ఒసి) | పసుపులేటి ప్రసాద్ | కాకర్ల గురవయ్య |
| 5వార్డు (జనరల్) | గ్రంధి నారాయణశెట్టి | కిన్నెర ప్రసాద్ |
| 6వార్డు (బిసి) | ఎస్.కిషోర్‌బాబు | మాదాల పెద్దసుబ్బరాయుడు |
| 7వార్డు (ఒసి మహిళ) | చిన్నిపద్మ | ఎం.విజయలక్ష్మి (బిజెపి) |
| 8వార్డు (ఎస్‌సి) | పి.చిన్నయ్య | వి.ముక్తిబాబు |
| 9వార్డు (ఎస్‌టి మహిళ) | వి. విజయలక్ష్మి | వై.నాగేశ్వరి |
| 10వార్డు (ఒసి) | సిపిఐకి కేటాయించారు | ముంగమూరు శ్రీధరకృష్ణారెడ్డి |
| 11వార్డు (బిసి) | బూదూరు ఆరోగ్యస్వామి | సుబ్రహ్మణ్యం |
| 12వార్డు (ఒసి) | ఆనం జయకుమార్‌రెడ్డి | కోటంరెడ్డి శ్రీనివాసులురెడ్డి |
| 13వార్డు (బిసి) | కె.శ్రీధర్ | షేక్. బాషా |
| 14వార్డు (బిసి) | పసుపులేటి వెంకటేశ్వర్లు | కిన్నెర కృష్ణమూర్తి (బిజెపి) |
| 15వార్డు (ఒసి) | చీరల శేషారెడ్డి | నాగిరెడ్డి శ్రీనివాసులురెడ్డి |
| 16వార్డు (ఒసి) | ఊటుకూరు లక్ష్మయ్య | డి.వి.రెడ్డి (బిజెపి) |
| 17వార్డు (ఒసి) | కె.విజయశేఖర్‌రెడ్డి | కె.రఘురామిరెడ్డి |
| 18వార్డు (ఒసి) | ఎన్.భానుశ్రీ | పసుపులేటి ఇందిరావతమ్మ |
| 19వార్డు (ఎస్‌సి) | మాథ్యూస్ ఎలీషా | బి.మల్లిఖార్జున (బిజెపి) |
| 20వార్డు (ఒసి) | ఎం.నరేంద్రరెడ్డి | కె.వెంకటస్వామినాయుడు |
| 21వార్డు (ఒసి మహిళ) | నన్నపరెడ్డి కమలమ్మ | బి.నాగభూషణమ్మ (బిజెపి) |
| 22వార్డు (ఒసి మహిళ) | కంచి సుజాతమ్మ | బి.విజయలక్ష్మి |
| 23వార్డు (బిసి) | మెట్టు శివకుమార్ | ఎం.ఈశ్వరయ్య (బిజెపి) |
| 24వార్డు (ఒసి మహిళ) | కోడూరు సునందమ్మ | ఎం.అమరావతి |
| 25వార్డు (ఎస్‌టి) | కె. జానకిరామయ్య | వి.రమణయ్య |
| 26వార్డు (ఎస్‌సి) | టి.బాలసుధాకర్ | బి. బాలచెన్నయ్య (బిజెపి) |
| 27వార్డు (ఒసి) | చాట్ల నరసింహారావు | నూనెమల్లిఖార్జునయాదవ్ |
| 28వార్డు (బిసిమహిళ) | టి.మంజుల | కె.భువనేశ్వరి |
| 29వార్డు (ఒసి మహిళ) | ఎన్.శాంతమ్మ | గాదెం సరోజిని |
| 30వార్డు (ఎస్‌సి మహిళ) | కొండల అనిత | బి.స్వరూపమ్మ |
| 31వార్డు (ఒసి మహిళ) | పులిమి శైలజ | కరణం సుభాషిణి (బిజెపి) |
| 32వార్డు (ఒసి) | డాక్టర్ పిఎస్‌ఆర్‌కెమూర్తి | కెవి. సుబ్రహ్మణ్యం (బిజెపి) |
| 33వార్డు (బిసి మహిళ) | బెల్లపు ఇందిరమ్మ | జొన్నలగడ్డ శమంతకమణి |
| 34వార్డు (ఒసి) | పుట్టారామకృష్ణారెడ్డి | వేలూరు సుబ్బారావు |
| 35వార్డు (ఒసి మహిళ) | షేక్ సల్మాజబీర్ | మొగల్ షంషాద్ బేగం |
| 36వార్డు (బిసి) | షేక్ షఫీ | షేక్ న్యామతుల్లా |
| 37వార్డు (ఒసి) | వి. పెంచలనరసింహం | శీనయ్య |
| 38వార్డు (ఒసి) | గార్లపాటి విజయకుమార్ | ధర్మవరం సుబ్బారావు |
| 39వార్డు (ఒసి) | సయ్యద్ సందాని బాషా | నావూరు ప్రభాకర్‌రెడ్డి |
| 40వార్డు (ఒసి) | షేక్ మున్నా | కప్పిర శ్రీనివాసులు (బిజెపి) |
| 41వార్డు (బిసిమహిళ) | కంచి కామేశ్వరి | దువ్వూరు అరుణ (బిజెపి) |
| 42వార్డు (బిసి) | ఎన్. నరసారావు | ధారా జయరాక్ |
| 43వార్డు (బిసి) | ఊటుకూరు నాగేశ్వరరావు | ఎస్‌కె. హైదర్‌అలీ |
| 44వార్డు (బిసి) | ఉడతా వెంకటరావ్‌యాదవ్ | సంక్రాంతి కల్యాణ్‌యాదవ్ |

## గూడూరు

మొదటి పేజీ కొరవ

కోవడంతో ఎంత గోకినా దురద తీరక ఇల్లు, వళ్లు గుల్లు చేసుకొంటున్న యువకుడు. గూడూరు కాంగ్రెస్‌లో తన ఉనికిని నిరూపించుకోవడానికి ఎంతకైనా తెగించే ఉద్రేకి - కోడూరు మీరారెడ్డి ఏకంగా ఛైర్మన్ పదవితో పాటు, 28 కౌన్సిల్ స్థానాలకూ స్వతంత్ర అభ్యర్థులను రంగంలోకి దింపాడు. ఈ వార్త వ్రాసే సమయానికి ఉపసంహరణ మూడ్‌లోనే లేదు. దానితో కాంగ్రెస్ పార్టీలో కార్యకర్తలు చిందర వందరై పోతున్నారు.

గత ఇరవయ్యేళ్ల నుంచి టౌన్ కాంగ్రెస్‌కు ఏకైక నేతగా వున్న ఎల్లసిరి గోపాలరెడ్డికి, ఇటీవలే తెరపైకి వచ్చిన మీరారెడ్డికి ఉప్పులోనిప్పు బాంధవ్యం. ఆయన ఎడ్డెం అంటే ఈయన తెడ్డెం అనడం అలవాటై పోయింది. ఇప్పుడూ అదే సమస్య.

తెలుగుదేశంలో చంద్రబాబు నాయుడు రామాయపట్నం మధ్యస్థం చేసి శీలం కిరణ్‌కుమార్ సతీమణికి ఛైర్మన్‌గిరి, కోడూరు శ్రీనివాసులురెడ్డికి వైస్ ఛైర్మన్ గిరి ఇచ్చేటట్లు ఒప్పించాడని, అంతా సుఖాంతమైందని భావించాము. కాని అదీ భ్రమేనని తెలుతున్నది. కోడూరు శీనయ్య అసంతృప్తితో రగిలిపోతున్నాడు. అట్లని ప్రత్యక్ష యుద్ధం చేయడానికి తెగింపు లేదు. అధికార పార్టీతో తెగతెంపులు చేసుకోవడం తన వ్యక్తిగత సమస్యల దృష్ట్యా ప్రమాదం. అందుకని శల్య సారథ్యంబెస్ట్ అనుకున్నట్లున్నాడు. కాంగ్రెస్ రెబల్ మీరారెడ్డితో లోపాయికారీ ఒప్పందం చేసుకున్నాడట. కోడూరు శీనయ్య తెలుగుదేశ విధ్వంసక యజ్ఞం రెండు హోమగుండాలతో జరుగుతున్నది. మొదటిది - తెలుగుదేశం అధికార టిక్కెట్‌లు సాధ్యమైనన్ని అవ్యక్తులు, అనామకులైన వారికి ఇప్పించడం ద్వారా ఆయా వార్డులలో పార్టీని బలహీన పరచడం; రెండవ ప్రక్క తన అనుచర గణాన్నంతా మీరారెడ్డి శిబిరానికి తరలించి వారిని గెల్పించడం... ఇదట శీనయ్య స్ట్రాటజీ.

తెలుగుదేశంలో ముఠాలపోరు కడు రసవత్తరంగా వుంది. శీలం కిరణ్‌కుమార్‌కు శీనయ్యకు సరిపడదు; శీనయ్య అంటే వైఎస్‌ఆర్‌కు కష్టం; వైఎస్‌ఆర్ పేరు చెప్తే దుర్గాప్రసాద్‌కు కోపం; ఛైర్మన్ సునీల్ అంటే చాలా మందికి చుక్కెదురు; వైస్ ఛైర్మన్ జనార్దన్ అంటే సగం మందికి కడుపుమంట. వీరందరూ తలా ఒక బాకు, కొండొకచో వాకు చొక్కాల క్రింద దాచుకొని తిరుగుతున్నారు; సందు దొరికితే కసుక్కున పొడిచి పారేయడానికి రెడీగా వున్నారు. కాని పైకి మాత్రం నవ్వు ముఖాలు, రాజీ సంభాషణలు, ఐక్యతా రాగాలు...!

కొరవ 6వ పేజీలో

### గూడూరు మునిసిపాలిటీలో పోటీలో వున్న అభ్యర్థులు

| | కాంగ్రెస్ | తె.దే/బిజెపి | మీరారెడ్డిగ్రూప్ |
|---|---|---|---|
| 1వార్డు | పల్లిశీనయ్య | వై.కోటేశ్వరరావు | |
| 2వార్డు | మేడా ఆదిశేషారెడ్డి | డి.వెంచురామయ్య (బిజెపి) | |
| 3వార్డు | ఎం.శ్రీనివాసులు | ఎం.బాబు | ఎస్.శ్రీను |
| 4వార్డు | ఇ.నాగరాజు | షేక్ కరీముల్లా | ఎస్.రమణయ్య |
| 5వార్డు | అరవ కామాక్షి | వై.సరోజనమ్మ | బి.రమణమ్మ |
| 6వార్డు | ఎల్లసిరి గోపాలరెడ్డి | బి.కృష్ణమనాయుడు | అబ్దుల్‌ఖాసిం |
| 7వార్డు | ఎస్.నాగులు | ఎం.డి.అబ్దుల్‌రహీం | కోడూరు మీరారెడ్డి |
| 8వార్డు | కె.రాజగోపాల్ | షేక్.గౌస్‌బాషా | చినమస్తానయ్య |
| 9వార్డు | కె.సోమయ్య | తూపిలిప్రకాశ్ | చింతల శ్రీనివాసులు |
| 10వార్డు | సిహెచ్. రమణయ్య | ఎం.వెంకటేశ్వర్లు | |
| 11వార్డు | షేక్. కరిముల్లా | ఓ.నాజరుద్దీన్ | |
| 12వార్డు | పూజారి పద్మావతి | జి.నారాయణమ్మ | ఎస్.తులసి |
| 13వార్డు | జమునమ్మ | తూపిలి లక్ష్మి (బిజెపి) | |
| 14వార్డు | ఎస్వీ సుబ్బమ్మ | డి.కమలమ్మ | సిహెచ్.మంజుల |
| 15వార్డు | పి.ప్రసాద్ | గిరిసురేంద్రనాథ్ | |
| 16వార్డు | వై.శ్రీధర్‌రెడ్డి | వై.శ్రీనివాసులు (బిజెపి) | ఎం.అమరేంద్రరెడ్డి |
| 17వార్డు | ఎస్‌కె. అబిరాబీ బేగం | ఎస్‌డి. అబ్దుల్ | అరవింద దక్షాయణి |
| 18వార్డు | ఎన్.వెంకటేశ్వర్లు | అభిమున్నీసా | ఝాన్సీ |
| 19వార్డు | డి.సూర్యారావు | శనగల వెంకట్రావ్ | దేవరాజు |
| 20వార్డు | జి.సరస్వతి | ఎం.ఇందిరమ్మ | జి.మృదుల |
| 21వార్డు | ఆర్.ఝాన్సీరాణి | ఎస్.స్వర్ణలత | ఎస్.సునీల్ |
| 22వార్డు | జి.ఉషాలక్ష్మి | ఆర్.మీనాక్షి | సిహెచ్.రాధమ్మ |
| 23వార్డు | ఎ.అనూరాధ | ఎ.కృష్ణవేణమ్మ | ఎం.విష్ణువదన |
| 24వార్డు | ఎ.వెంకటేశ్వర్లు | బి.మురళీకృష్ణ (బిజెపి) | |
| 25వార్డు | డి.వెంకటేశ్వర్లు | పులిమిశ్రీనివాసులు | డి.రవీంద్రరెడ్డి |
| 26వార్డు | ఎం.రత్నమ్మ | డి.సంధ్యారాణి | |
| 27వార్డు | చల్లాశ్యామ్‌ప్రసాద్ | ఎస్.నరసింహులు | |
| 28వార్డు | దండు మహేష్‌రెడ్డి | వి. వెంకటేశ్వర్లు | |

## జిల్లావార్తలు

5వ పేజీ కొరవ

పలు గ్రామాల్లో కిరోసిన్ పంపిణీ సరిగ్గా లేదు. డీలర్లు స్టాక్ పాయింట్ వద్దే దీన్ని అమ్మేస్తున్నారని గగ్గోలుగా వుంది. నెలలో ఒక పూట మాత్రమే డీలర్లు కిరోసిన్ పోస్తున్నారు. రెవిన్యూ అధికార్లకు రేషన్ షాపులు తనిఖీ చేసే తీరిక దొరకడం లేదు.

### వెయ్యి రూపాయలిస్తే పాసు పుస్తకమిస్తాం

అనుమసముద్రం పేట మండలంలోని రైతులకు. వీఏఓలు పట్టాదారు పాసు పుస్తకాలు ఇవ్వక పోవడం వల్ల రైతులు పడరానిపాట్లు పడుతున్నారు. వెయ్యి రూపాయలిస్తే పాసు పుస్తకాలిస్తామని వీఏఓలు డిమాండ్ చేస్తున్నట్లు రైతులు చెబుతున్నారు. తప్పులివ్వకపోతే వాస్తవ యజమానులు చనిపోయి సంవత్సరాలు గడుస్తున్నా పొలం మీ తండ్రి పేరు మీద వుంది , నీకెలా పుస్తకమిస్తామని పొలం హక్కుదార్లను దబాయిస్తున్నారు. ఎకరా పొలం లేకుండా కూడా ఇక్కడి నీటి సంఘం డైరక్టర్‌గా పోటీ చేసిన ఒక వ్యక్తికి పాసు పుస్తకాలిచ్చిన ఘనులు ఇక్కడి వీఏఓలు.





### రాపూరులో ట్రాఫిక్‌కు అంతరాయం

రాపూరులో ట్రాఫిక్‌కు ప్రతి సాయంత్రం అంతరాయం ఏర్పడుతుంది. పాతబస్టాండు, కోరా కాంప్లెక్స్, సినిమాహాలు రోడ్, పెంచలకోన రోడ్‌లో ట్రాఫిక్ ఆగి పోతుంది. గతంలో ఇక్కడ పనిచేసే ఎస్‌ఐ ట్రాఫిక్‌పై ప్రత్యేక దృష్టి నిల్పి ఈ సమస్యను పరిష్కరించేవారు. ప్రస్తుతం పోలీసులు మిన్నకుండి పోవడంతో ప్రజలు ఇబ్బందులు పడుతున్నారు.

### సోమిరెడ్డిచే పాఠశాల ప్రారంభం

కోడూరులో గ్రామస్థుల సహకారంతో నిర్మించిన పాఠశాలను ఎమ్మెల్యే సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి ఇటీవల ప్రారంభించారు. గ్రామంలో పాఠశాల లేని కొరత ఇన్నాళ్లకు తీరడంతో గ్రామస్థుల ఆనందానికి అవధుల లేవు. ప్రారంభోత్సవ కార్యక్రమంలో జడ్పీటిసి సభ్యుడు రవీంద్రరెడ్డి, సర్పంచ్ పెంచలయ్య కూడా పాల్గొన్నారు.

### కోడూరు శివాలయంలో ప్రతిష్టలు

కోడూరు కోటేశ్వర స్వామికి ఆస్తిపాస్తులున్నా ఆలయ అభివృద్ధి ధర్మకర్తలు ఏనాడూ పట్టించుకోలేదు. సర్పంచ్ వీరబోయిన పెంచలయ్య 4లక్షలు వెచ్చించి విమాన శిఖరం, ఇతర మరమ్మత్తులు ఇటీవల చేయించారు. 3రోజుల పాటు ఆగమవాచస్పతి కారంబేటి పార్వతీశం ప్రతిష్టల కార్యక్రమం నిర్వహించారు. 27తేదీ నుంచి శివరాత్రి ఉత్సవాలు మొదలు కానున్నాయి.

## రేషన్ బియ్యం

5వ పేజీ కొరవ

నాథుడే లేకుండా పోయాడు. 1951లో రాపూరులో ఈ గ్రంథాలయాన్ని ప్రారంభించారు. ఇందులో ఒక లైబ్రేరియన్, అటెండర్, వాచ్‌మెన్‌లుండేవారు కాలక్రమేణ ఒక్కొక్క అధికారి పదవీ విరమణ చేయడం, కొత్త వారిని నియమించక పోవడంతో గ్రంథాలయం మూతపడి పోయింది. గ్రంథాలయంలో 2వేల పుస్తకాలతోపాటు, ఎంప్లాయిమెంట్ న్యూస్, ఇతర దినపత్రికలొచ్చేవి. పోటీ పరీక్షలకు వెళ్లే విద్యార్థులు కావాల్సిన పుస్తకాలు కూడా లైబ్రేరియన్ తెప్పించి పెట్టేవారు. 1994లో ఇక్కడ లైబ్రేరియన్‌గా పనిచేసే కోట ఆనందరావు పదవీ విరమణ చేశారు. అప్పటి నుంచి ఆల్ ఇన్ వన్ క్రింద బాధ్యతలన్నీ అటెండర్ బండారు వెంకట సుబ్బయ్య నిర్వహిస్తూ వుండేవారు. ఆయన కూడా పదవీ విరమణ చేయడంతో లైబ్రరీ మూతపడిపోయింది. గ్రంథాలయం మూతపడిన విషయాన్ని ప్రజలు ఎమ్మెల్యే ఆనం రామనారాయణరెడ్డి దృష్టికి తీసుకువెళ్లగా, జిల్లా కలెక్టర్‌కు చెప్పి కాంట్రాక్ట్ పద్ధతిపై సిబ్బందిని నియమింపచేస్తానని వాగ్దానం చేశారు. వెనుకబడిన ప్రాంతంలో గ్రంథాలయం మూతపడి ప్రజలకు సమాచార అందక పోవడం బాధాకరం.



## మందుబాబులు

5వ పేజీ కొరవ

మంచినీటిని కొని తాగాల్సిన దుస్థితి దాపురించింది. గ్రామంలో ఎక్కడా మంచినీటి వసరు లేకపోవడంతో 2కిలోమీటర్ల దూరం నుంచి బండ్లలో నీళ్లు తెచ్చి బిందె ఐదు రూపాయల చొప్పున అమ్ముతున్నారు. దర్గావద్ద కాళ్లు కడుక్కోను కూడా నీళ్లు లేకపోవడం వల్ల భక్తులు ఇబ్బందులు పడుతున్నారు. చెరువులో బోరు వేసి దర్గావరకు పైపు లైను వేస్తేగాని భక్తులకు మంచినీటి సమస్య తీరదు. ఎండాకాలం రాకముందే బిందె 5 రూపాయలు అమ్ముతున్న నీరు, ఎండాకాలంలో పది రూపాయలు పలికినా ఆశ్చర్యపడాల్సిందేమీ లేదు.

### నో రిగ్రేట్స్!!

-తిరుమూరు సుధాకర్‌రెడ్డి

ఒక్క అగ్గిపుల్లతో
సిగరెట్ వెలగకపోతే-
నో రిగ్రేట్స్!
ఒక్క పెగ్గు మందుతో
మబ్బుల్లో తేలకపోతే-
నో రిగ్రేట్స్!
ఒక వయ్యారిభామతో
ప్రేమ పండకపోతే-
నో రిగ్రేట్స్!
ఒక చీటింగ్‌తో
నీ బాండ్లు బెండ్లు అయితే
నో రిగ్రేట్స్!
ఒక లైఫ్‌లో
వంద చావులొస్తే-
నో రిగ్రేట్స్!
ఒక చావుతో
వందేళ్ల లైఫ్ పోడిపోతే-
వ్వాట్ ఎ పిటీ!!

## గెలిపిస్తే

4వ పేజీ కొరవ

ప్రమాణం చేసి ప్రచారానికి బయలు దేరుతారు. నీతిని తప్పిన కాంగ్రెస్ కౌన్సిలర్ ఎవరైనా నిలదీయవచ్చన్నారు. లక్షలు సంపాదించే వృత్తి చేతిలో వున్నా ప్రజల కోసం పని చేయాలని ముందుకు వచ్చిన యశోధరను చక్కని పురపాలన కోసం గెలిపించాలన్నారు. అనంతరం కార్యకర్తల జయజయ నినాదాలు, పార్టీ జెండాల రెపరెపల మధ్య 1.15కు మునిసిపల్ కార్యాలయానికి చేరి కమీషనర్‌కు రెండు సెట్ల నామినేషన్ పత్రాలు సమర్పించారామె. ఎసి. సుబ్బారెడ్డి కుమార్తె జ్యోతి వివేకానందరెడ్డి సోదరి శ్రీవల్లి, యశోధర నామినేషన్‌ను ప్రతిపాదించి, బలపరిచారు. ఈ కార్యక్రమంలో ఎమ్మెల్యే వివేకానందరెడ్డి, సీనియర్ కౌన్సిలర్లు శివి. రాఘవరెడ్డి, చాట్ల నరసింహారావు, సందానిబాషా, రావుల అంకయ్యగౌడ్, ఆనం విజయకుమార్‌రెడ్డి తదితరులు పాల్గొన్నారు.

నెల్లూరు మునిసిపాలిటీ 12వ వార్డు కాంగ్రెస్ పార్టీ తరపున కౌన్సిలర్‌గా నామినేషన్ ధాఖలు చేస్తున్న ఆనం జయకుమార్ రెడ్డి, ప్రక్కన విజయకుమార్ రెడ్డి, శశిధర్.

## నా భార్య

4వ పేజీ కొరవ

చెప్పారు. కెవి సుబ్బారెడ్డి మాట్లాడుతూ అనురాధ ముఖం చూస్తుంటే ప్రజలకు ఓటెయ్యాలని పిస్తుందన్నారు. డేగా నారసింహారెడ్డి మాట్లాడుతూ తాను అసెంబ్లీ ఎన్నికల్లో పోటీ చేసినప్పుడు జరిగిన తప్పిదాలు ఈ ఎన్నికల్లో తిరిగి జరగకూడదన్నారు. శ్రీమతి తాళ్లపాక అనూరాధ అత్యంత ఆర్భాటంగా 20తేదీ నామినేషన్ దాఖలు చేశారు. మంత్రి ప్రభాకరరెడ్డి, జిల్లా పార్టీ ఇన్‌ఛార్జ్, ఎమ్మెల్యే, మాజీ ఎమ్మెల్యేలు, మిత్రపక్షం బిజెపి నేతలు వెంటరాగా, సుబేదారుపేటలోని ఎబిఎం చర్చ్ కాంపౌండ్ నుంచి తప్పెట్లు, బాణా సంచా మోతల మధ్య ఓపెన్ టాపులో ప్రజలకు నమస్కరిస్తూ నిలబడగా, ఊరేగింపు బయలుదేరింది. ఎసి సెంటర్‌లోసుబ్బారెడ్డి విగ్రహానికి పూలమాల వేశారావె. తెలుగుదేశం, బిజెపి కార్యకర్తలు పెద్ద సంఖ్యలో తరలిరాగా మునిసిపల్ కార్యాలయానికి చేరి నాలుగు సెట్ల నామినేషన్ పత్రాలు కమీషనర్ వేమారెడ్డికి అందించారు. నామినేషన్ కార్యక్రమానికి అసమ్మతి నేతలు శ్రీధర్‌కృష్ణారెడ్డి, వైవి. రామిరెడ్డి బృందం కూడా హాజరయ్యారు. నామినేషన్‌లో నాయకుల తీరుతెన్నులు పరిశీలించేందుకు గూఢచారి 116లా తెలుగు విద్యార్థి రాష్ట్ర అధ్యక్షుడు నర్రా రవికుమార్ మునిసిపల్ ఆఫీసు పరిసరాల్లో తారట్లాడు తుండినాడు.

## జనవాణి

3వ పేజీ కొరవ

జయభారత్ హాస్పిటల్‌లో 50శాతం రోగులు ముస్లింలే. సేవే పరమావధిగా నడుస్తున్న ఆర్‌ఎస్‌ఎస్‌ను మత సంస్థ అనడం తగదు.

నెల్లూరు — జి.వాసు, ఎం.లక్ష్మీనరసింహం

### కూరగాయల మార్కెట్‌లో అన్యాయాలు అరికట్టండి

నెల్లూరు ఎసి కూరగాయల మార్కెట్‌లోని వ్యాపారులకు నీతి లేదు. ప్రజలను దోచుకోవడమే వీరి రీతిలా కనబడుతుంది. ఇటీవల కూరగాయల మార్కెట్‌లో రెండు కిలోల టమోటాలు కొని బయటకు వెళ్లి తూకమేయిస్తే అవి 1 1/4 కేజీ మాత్రమే వున్నాయి. ఈ మార్కెట్‌లో కూరగాయలను ఎవరుకొనివ్వరు: వాళ్లు తూచిందే తూకం. ఏమైనా అడిగితే నీచమైన మాటలు మాట్లాడి పైకి వస్తారు. మార్కెట్‌లో కలకాలం ఈ దోపిడి కొనసాగ వలసిందేనా? తూనికలు, కొలతలు, మార్కెటింగ్ శాఖాధికారులు. ఎంచాలు మరిగి వీరి ఆగడాలను ప్రోత్సహిస్తున్నారు.

నెల్లూరు — జి.సుబ్బారెడ్డి

### వీటి చరిత్ర తెలియజేయండి

నూతన శతాబ్ది శుభోదయ వేళ సింహపురి ప్రాచీన చరిత్రను అసాంతం మధురంగా పాఠకుల కందిస్తున్న డాక్టర్ రామచంద్రరావును అభినందిస్తూ, ఆయన వ్యాస పరంపరలో కొన్ని అంశాలను ప్రస్తావించ కోరుతున్నాను. ఖడ్గ తిక్కన చారిత్రక పురుషుడా లేక కథానాయకుడా? మనుమసిద్ధి - కాటమరాజు యుద్ధానంతర రాజకీయ పరిణామాలు ఏమిటి? కవి తిక్కన కాలంలో వాసిగాంచిన సింహపురి తదుపరి కాలంలో ఎందుచేత మరుగున పడింది. కాటమరాజుతో జరిగిన యుద్ధాన్ని తెల్పే శాసనాలేమన్నా నెల్లూరు ప్రాంతంలో లభ్యమైనాయా? ఈ యుద్ధాన్ని తిక్కన రచనలలో ఎక్కడైనా ప్రస్తావించబడిందా? కందుకూరు తాలూకా గుండ్లపాళెంలోని శిలా శాసనంలో వున్న కాటమరాజు చరిత్రాంశాలు నమ్మతగినవా? కనిగిరి దుర్గంలో గాని, ఆ ప్రాంతంలో మరేమన్నా ప్రాచీన ఆధారాలు లభించాయా, లేక జానపదులుపాడే కాటమరాజు కథే ఈ చరిత్ర తెల్పే ఆధారమా? పెన్నదాటితే పెరుమాళ్ల సేవ అనే నానుడి ఎప్పుడు పుట్టింది? మరి నేడు పెన్నా ఉవలి వైపునే రంగనాథుడు వెంచేసి యున్నాడు. ఏందీ తిరకాసు. ఈ వ్యవహారాలన్నింటిని రచయిత తెలియజేస్తే బాగుంటుంది.

విశాఖపట్నం — ఎం.రామమూర్తి

## 50 ఏళ్లకితం

3వ పేజీ కొరవ

చినట్లు తెలుస్తున్నది. ఈ పేద ప్రజలనంతా నట్టడవిలో వదలిపెట్టి పోవుటకు మేము సుతరాము ఒప్పుకోము.

### ధాన్యం శిస్తువసూలు ఆపుదల

ధాన్యం శిస్తు వసూలును ఆపవలసిందిగా ఎస్టేటు మేనేజరు 'స్టే' ఆర్డరిచ్చినట్లు తెలుస్తున్నది.

# మనీషా 'ప్రేమ' తమాషా

నేపాలీ సుందరి, హీరోయిన్ మనీషా కొయిరాలా చీరెలు మార్చినంత తేలికగా ప్రియుళ్లను మారుస్తోంది. మూడు నెలలకొక సారి ముచ్చటగా కొత్త, కొత్త వాళ్లతో ముద్దు ముచ్చట్లు సాగిస్తోంది. కొంత కాలంగా తన వలలో చిక్కుకొన్న ప్రియుడు హుస్సేన్‌ను ఇప్పుడు మనీషా వదిలేసింది. అందువల్లనే ఈ మధ్య సినిమా షూటింగుల్లో మనీషా కొయిరాల రుసరుసలాడుతూ కనపడుతుంది. చీటికి మాటికి చిర్రు బుర్రులాడుతోంది. హుస్సేన్‌తో వియోగానికి కారణమేమిటని మనీషాను అడగ్గా, ఆమె కళ్లలో నీళ్లు తిరిగాయి. హుసేన్ ప్రేమలో కమిట్‌మెంట్ లేదు. అడిగింది కొనివ్వడు. నా మనసు తెలుసుకొని మసులుకోడు. ఏరోజుకైనా అతను నమ్మశక్యమైన వ్యక్తి కాదు అని చెప్పింది. అటువంటి వాడిని ముందరే వదలుకొంటే మంచిదని తలపోసి అతనికి దూరమయ్యానంది.

## మరో ప్రియుడి కోసం వల

### దర్శకుని నమ్మకం

'కుచ్‌కుచ్ హోతాహై' వంటి సూపర్‌డూపర్ హిట్ సినిమా తీసిన దర్శకుడు కరణ్ జోహార్‌కు ఒక నమ్మకముంది. తన చిత్రం ఏదైనా సరే దాని స్క్రిప్ట్ లండన్‌లో రాసినట్లయితే అది తప్పనిసరిగా హిట్ అవ్వడం ఖాయమని కరణ్ నమ్మకం. అందుకే తన తాజా చిత్రం ప్రారంభోత్సవం కోసం మళ్లీ లండన్ బయలుదేరి వెళ్లాడాయన.

### సౌందర్య కోరిక తీరిందట

బిజీ హీరోయిన్ సౌందర్య అమ్మోరు చిత్రంలో భక్తురాలిగా నటించింది మొదలు, ఏదో ఒక చిత్రంలో దేవతగా నటించాలనే కోరిక మనసులో నాటుకొందట. నాగదేవత చిత్రంలో దర్శకుడు సాయిప్రకాష్ తనను దేవతగా నటించమని కోరగానే అంగీకరించాను. ఎంతో నియమనిష్టలతో పాత్ర పోషించాను.

చాలా బాగుంది చిత్రంలో మాళవిక, శ్రీకాంత్.

# బాబూమోహన్ బ్యాలెన్స్ ఫీట్

రాజకీయాల్లోకి వచ్చాక సినిమాలు తగ్గాయన్న విషయాన్ని బాబూమోహన్ అంగీకరించడం లేదు. ఇప్పుడు నేను నటుడిగా, రాజకీయ నాయకునిగా 'ద్విపాత్రాభినయం' చేస్తున్నాను. ఈ రెండు పడవల ప్రయాణం నన్ను ముంచుతుందా, తేల్చుతుందా అన్న సందేహం అందరికీ కలుగుతుంది. ఈ రెండు పడవలకు సరంగుని నేనే. అంచేత మునగడం, తేలడం నా చేతుల్లోనే వుంది. ఈ రెండింటికీ డేట్స్ నేనే ఇవ్వాలి కాబట్టి నా అనుకూలాన్ని బాధ్యతల్ని పట్టిపోతున్నాను. రాజకీయమన్నది ప్రజాసేవకు సంబంధించింది కాబట్టి సహజంగానే ప్రజాసేవపైనే కాస్త ఎక్కువ బాధ్యత వహించ వలసి వుంటుంది. అంచేత సినిమాల విషయంలో కాస్త సెలెక్టివ్‌గా వుంటున్నాను. కాబట్టి ఒక పడవ ముంచడం, ఒక పడవ తేల్చడం అన్న ప్రసక్తిరానే రాదన్నారాయన.

## హైదరాబాద్ సినిమా వార్తలు

### నాగార్జున కొత్త చిత్రం

వైజయంతీ మూవీస్ నాగార్జున హీరోగా తిరుపతి స్వామి దర్శకత్వంలో కొత్త చిత్రాన్ని నిర్మిస్తుంది. సౌందర్య హీరోయిన్‌గా నటించే ఈ చిత్రానికి మాటలు: పరుచూరి బ్రదర్స్, కథా సహకారం యండమూరి వీరేంద్రనాథ్.

# డబ్బుపై యుక్తాముఖి అనురక్తి!

విశ్వసుందరి యుక్తాముఖి సినీరంగంలోకి అడుగుపెట్టక ముందే, నిర్మాతలకు పారితోషికం విషయంలో వాతలు పెడుతోంది. నటన వచ్చినా రాకపోయిన తన అందాల్ని పెండార బోసి, నిర్మాతల నుంచి, డబ్బులు పిండాలను కుంటోంది. ఒకే ఒక్కడు చిత్ర కథ కొత్తదనంతో వుండడం వల్ల ఈ చిత్రం విజయవంతం కావడంతోపాటు అందులో హీరో అర్జున్‌కు ఎనలేని పేరు ప్రఖ్యాతులు వచ్చాయి. ఈ సినిమా విజయం తర్వాత అర్జున్ సెలక్టివ్ చిత్రాలు చేస్తున్నాడు. తనతో కొత్తగా చిత్రాలు తీస్తానని వస్తున్న నిర్మాతలకు 'యుక్తాముఖిని' పెట్టమని అడుగుతున్నాడట. ఆమెను కనుక బుక్ చేస్తే తన రెమ్యూనరేషన్ కూడా తగ్గించుకొంటానని చెప్పాడట. అర్జున్ కోరిక తీర్చను ఒక నిర్మాత యుక్తాముఖిని సంప్రదించగా అర్జున్‌పారితోషకం అడిగినదానికి రెండింతలు ఇస్తే చెప్పినట్టు నటిస్తానని అభయమిచ్చిందట. పాపం, ఆ నిర్మాత కళ్లు తేలేసి వెనక్కి వచ్చేశాడు.

## హీరోకన్నా రెండింతల పారితోషికం కావాలట!

### ఫాంటసీపార్కులు పెట్టాలి

కష్టాలు, బాధలు మర్చిపోవడానికి పలువురు రకరకాల పనులు చేస్తుంటారు. విశ్వసుందరి ఐశ్వర్య మాత్రం తన బాధల్ని మర్చిపోవడానికి ఫాంటసీ పార్కులకు వెళ్తుంది. మద్రాస్‌లో కొత్తగా ఇటువంటి ఫాంటసీ పార్కులను నెలకొల్పారు. ఈ పార్కుల్లోకి వెళితే అన్నీ మర్చిపోతాం. ఇటువంటి పార్కులు మరిన్ని పెడితే బాగుంటుందని ఐశ్వర్య చెబుతుంది.

### బాలుకు ఇంకో అవార్డు

ఇప్పటికే ఎన్నో అవార్డులు తన స్వంతం చేసుకున్న బాలసుబ్రహ్మణ్యంకు మధ్యప్రదేశ్ ప్రభుత్వం లతామంగేష్కర్ పేరిట ఇచ్చే జాతీయ అవార్డును ప్రకటించింది. అవార్డుతోపాటు లక్ష రూపాయల నగదుతో మధ్యప్రదేశ్ ముఖ్యమంత్రి దిగ్విజయ్ సింగ్, బాలును సత్కరిస్తారు.

# నవ్వుల హరివిల్లు - హ్యాండ్సప్

## చిత్రసమీక్ష

గ్రద్దలూరు గోపాలరావు

"హ్యాండ్సప్" చిత్రం ఆది నుంచి అంతం వరకు వినోదాత్మకంగా సాగుతుంది. పెదవి మీద లాస్యం చిందాడించే చిరుహాస్యంగా, వినోదం ప్రారంభమై, పోనుపోను కడుపుబ్బా నవ్విస్తుంది. పడి పడి నవ్వేట్టుగా చేస్తుంది. మండే ఎండలాంటి వేడివేడి సన్నివేశాల్లో చల్లని వినోదాన్ని అందిస్తుంది. గడ్డకట్టించే చలిలాంటి శోకసన్నివేశాల్లో వెచ్చదనం కూర్చే హాస్యం పొత్తు కుదురుస్తుంది. ఇంతెందుకు నటనలో హాస్యం, నడకలో హాస్యం, పలుకులో హాస్యం, కులుకులో హాస్యం, ఫైటింగుల్లో హాస్యం. పిస్టల్ చూపి భయపెట్టి "హ్యాండ్సప్" అన్నట్టుగా, ఈ చిత్రంలోని హాస్యపు హరివిల్లు ప్రేక్షకుల మీదికి ఎక్కుబెట్టి హ్యాండ్సప్ "-ను హాస్యభంగిమగా మార్చేసింది.

దర్శకుడు శివనాగేశ్వరరావు కథలోని అపరాధ పరిశోధనలను, శవయాత్రలను శవాలతో నడకలను, టీ పార్టీలను, ప్రెస్‌కాన్ఫరెన్స్‌లను, ఇలాంటి సరదాలన్నిటిని తమషాగా హాస్య సృష్టికి ఉపయోగించుకున్నాడు. చిత్రం నిలువెల్లా హాస్యం ఒలికించి, అలవోకగా వినోదం పండించి, ప్రేక్షకుల గుండెల నిండుగా నవ్వుల జల్లుకురిపించారు. ప్రముఖనటి జయసుధ సమర్పణలో ఆమె భర్త నితిన్ కపూర్ ఈ చిత్రాన్ని నిర్మించాడు.

నేరపరిశోధనతో సాగే కథలో తుగ్లక్ (హిందీ నటుడు) రామ్‌కోటి (కోట శ్రీనివాసరావు) అనే ఇద్దరు అపరాధులుగా వుంటారు. వీరు బాంబులతో భయానక దృశ్యాలు సృష్టిస్తుంటారు. ప్రతి ఇంటా బాంబులు పేలాలని దీపావళి టపాకాయల్లోను, చిచ్చుబుడ్లలోను పేలుడు పదార్థాలు పెట్టుంటారు.

నగరంలో వరుసగా సంభవించిన పేలుళ్ల వెనుక వున్న టెర్రరిస్టులను పట్టుకునేందుకు నగర పోలీసులు విఫలం కావటంతో, ఢిల్లీ నుంచి సరస్వతి (జయసుధ అనే సిబిఐ అధికారిణిని పిలిపిస్తారు. ఆమె కోరిక మేరకు, నగర పోలీస్ అధికారి (గిరిబాబు), జగన్ (బ్రహ్మానందం), ముద్దుకృష్ణ (నాదేంద్ర బాబు) అనే ఇద్దరు ప్రైవేటు డిటెక్టివులను ఆమెకు సహాయంగా వుంచుతాడు. వీరిద్దరితో కలసి సరస్వతి నేరపరిశోధన ప్రారంభిస్తుంది.

నగరంలో టెర్రరిస్టులుగా చలామణి అవుతున్న తుగ్లక్, రామకోటిల మధ్య డబ్బు వాటాల విషయంలో తగాదా రావటంతో తుగ్లక్, రామకోటిని హత్య చేస్తాడు. సరస్వతి అక్కడికి వస్తుంది. సోఫా మీద పడివున్న రామకోటి శవాన్ని చూస్తుంది. ఆ శవాన్ని వాడుకొని హంతకుల్ని పట్టుకునేందుకు పథకం పన్నుతుంది. రామకోటి చనిపోలేదని, బ్రతికేవున్నాడని ప్రకటిస్తుంది. రామకోటి బ్రతికున్నట్టు రుజువు చేసేందుకు రామకోటి శవాన్ని నడిపిస్తారు. మార్నింగ్ వాక్‌లు చేయిస్తారు. టీ పార్టీల్లో పాల్గొనేట్టు చేస్తారు. శవంతో ప్రెస్ కాన్ఫరెన్స్‌లు జరిపిస్తారు. ఈ సరదాలన్నీ హాస్య వల్లరికి బాగా ఉపకరించాయి. చివరన, నేరస్తులను డిటెక్టివులైన జగన్, ముద్దుకృష్ణలుగాక, హఠాత్తుగా రంగప్రవేశం చేసిన ఒక అధికారి(చిరంజీవి) పట్టుకుంటాడు. చిరంజీవి, సరస్వతి భర్త అని తెలుస్తుంది.

ప్రతి సన్నివేశంలోను దర్శకుడు బాగా నవ్వించగల సత్తాను కూర్చాడు. ప్రతిపాత్రను హాస్యం కోసం ఎంత వరకు ఉపయోగించుకోవాలో అంత వరకు వినియోగించు కున్నాడు. బ్రహ్మానందం, కోట, నాగేంద్రబాబు బ్రహ్మాండమైన హాస్యం అందించారు. తుగ్లక్ పాత్రధారి హిందీలో మాట్లాడడం, తనికెళ్ల భరణి తెలుగు తర్జుమా నవ్వు తెప్పించే రీతిలో సాగాయి. గిరిబాబు, చంద్రమోహన్‌లు వినోద మార్గాన్నే నడిచారు. జయసుధ చాలా హుందాగా నటించింది. వినోదానికి ఒక సొబగుగా నిలిచింది. చిరంజీవి కొసమెరుపుగా వచ్చి హాస్యపు విందులో అదనపు రుచి చేకూర్చాడు.

జనార్థన మహర్షి మాటలు వినోదాన్ని రంగరించుకున్నాయి. "సిరిసిరి మువ్వలతో చిరుచిరు దివ్వెలతో విరిసిన యవ్వనాల విలువ" - చంద్రబోస్ వ్రాసిన ఈ పాట శశిప్రీతమ్ సంగీతంలో ఆహ్లాదకరంగా వినిపిస్తుంది.

* * *

# కుష్బూకు 'తోడేలు' ప్రియుడు

తనకు దర్శకుడు సి.సుందర్‌కు త్వరలో వివాహమవుతుందని, ఇద్దరు కలసి కొత్త కాపురం పెట్టడానికి ఒక బంగళా కూడా కుష్‌బూ కొనిపెట్టింది. ఈ ప్రతిపాదనను సుందర్ తిరస్కరించినట్లున్నాడు. మొన్నటి వరకు కుష్‌బూ ఇంటికి వెళ్లిన వాళ్లు అక్కడ ముందు హాలులో కుష్‌బూ, డైరెక్టర్ సుందర్ కలసివున్న ఫోటోను చూసేవాళ్లు. ఇప్పుడు ఆ ఫోటో స్థానంలో ఓ పెద్ద పెయింటింగ్ కనిపిస్తోంది. ఆ పెయింటింగ్‌లో ఓ తోడేలు పక్కన ఓ అందమైన అడవి పిల్ల నిలుచుని వుంది. ఫోటోలో అమ్మాయికి కుష్‌బూ పోలికలు వున్నాయి. తనను సుందర్ మోసం చేశాడని సింబాలిక్‌గా చెప్పను కుష్‌బూ ఈ ఫోటో పెట్టించిందని మద్రాస్‌లో పలువురు చెవులు కొరుక్కుంటున్నారు.

## వికటించిన ప్రేమకథ

### మళయాళీయులను చూసి నేర్చుకోవాలి

మళయాళ పరిశ్రమలో నటులకు, సాంకేతిక నిపుణులకు వున్న మర్యాద మరోచోట వుండదని యువనటి శాలిని చెప్పింది. తమిళ, తెలుగు సినిమా వాళ్లంతా తాగుతూ డిస్కషన్స్ చేస్తారు. ఆ డిస్కషన్స్‌లో అనేకమైన చెడ్డ మాటలు కూడా మాట్లాడుతుంటారు. కానీ మళయాళ పరిశ్రమలో అలా వుండదు. ఆర్టిస్టును ఒక స్టూడెంట్‌లా చూస్తారు. కాలేజీకి స్టూడెంట్‌ను తీసుకెళ్లినట్లు జాగ్రత్తగా తీసుకెళ్లి, తీసుకొస్తారు. మంచి, మర్యాదకు పెట్టింది పేరు మళయాళ పరిశ్రమ అని ధైర్యంగా చెప్పింది శాలిని. విలాగు పెళ్లి చేసుకొని సెటిలై పోతున్నానని శాలిని ధైర్యం చేసి ఈ మాటలన్నట్లుంది.

* * *

# మనకవి, సుకవి, మనసుకవి-ఆచార్య ఆత్రేయ

మూగమనసుల ఊసులకు
మాటలు నేర్పిన భాష్యకారుడు
ప్రేమ హృదయ భావాలకు
పాటలు నేర్పిన గీతాకారుడు
హృద్యమైన పద్య విద్యాధన్యసావి
మన 'ఆత్రేయ'

అంతుతెలియని మనసు అగాధ లోతుల్ని శోధించి సుఖ దుఃఖాల అందుల్ని స్పృశించి, కమ్మని పాటల రూపంలో తెలుగు ప్రజల మనో మందిరాల్లో శాశ్వతంగా నిలిచిపోయిన మహనీయుడు. మనసుకు, మనిషికి మధ్య ఉన్న అనుబంధాలను, సంబంధాలను ఆత్రేయ చెప్పినంత అందంగా, అర్థవంతంగా, ఆర్ద్రంగా ఎవరూ చెప్పలేరు, ఇక చెప్పబోరు. అందుకే ఆయన మనసుకవి, సుకవి అయ్యారు.

ఆత్రేయ అసలు పేరు కిళాంబి వెంకటనరసింహాచార్యులు. పేరులోని ఆచార్యను, గోత్రంలోని ఆత్రేయను కలిపి, 'ఆచార్య ఆత్రేయ' అయ్యారు. 1921 సంవత్సరం మే నెల 7వ తేదీ సూళ్లూరుపేట తాలూకా మంగళంపాడు గ్రామంలో జన్మించిన ఆత్రేయ, సినీకవిగానే ఎక్కువ మందికి తెలిసినా, ఆయన గొప్ప తత్వవేత్త. తన పుట్టుకపై ఆయన రాసిన ఒక కవిత ఆయన ఆత్మశోధనకు, అంతరాత్మ అంతర్మథనానికి మచ్చుతునక.

జననినే బాధపెట్టిన జన్మకారకు
పరుల సుఖపెట్టగలనన్న భ్రాంతి ఏల

అన్న ఆత్రేయ, మరో సందర్భంలో

సుఖము నాతల్లి చేసిన సుకృతఫలమ్ము
దుఃఖమంతయు నా దుష్కృతమ్ము

అంటూ మాతృప్రేమ గురించి, మనిషి స్వయంకృతాపరాధాల గురించి రెండు వాక్యాల్లో చెప్పగలిగిన గొప్ప కవి.

కర్మ సిద్ధాంతం మనిషిలోని కార్య దక్షతను, దీక్షతను దెబ్బతీసి బానిసల్లా, పశువుల్లా మారుస్తుందని చెప్పే ఆత్రేయ పేదరికంలో మగ్గినా, సినీ పరిశ్రమలో వెలిగినా తన ఉత్థాన పతనాలకు ఏనాడూ కుంగలేదు, పొంగిపోలేదు. ఒకపాటలోని చరణాలు ఆయన జీవితానుభవాల అనుభూతులు.

అనుకున్నామని జరగవు అన్నీ
అనుకోలేదని ఆగవు కొన్ని
జరిగేవన్నీ మంచికని
అనుకోవడమే
మనిషి పని

అంటూ మనకు తెలియని జీవిత సత్యాన్ని తెలియజేసిన సత్యాన్వేషి ఆత్రేయ.

తన ప్రాథమిక విద్యాభ్యాసం తర్వాత ఆత్రేయ నెల్లూరులో చదువుకున్నారు. నెల్లూరు మున్సిఫ్‌కోర్టులో, తిరుత్తణి సెటిల్‌మెంట్ ఆఫీసులో గుమస్తాగా, జమీన్‌రైతు పత్రికలో సహాయ సంపాదకుడిగా, ఆంధ్ర నాటక కళాపరిషత్‌లో కార్యదర్శిగా పని చేశారు.

## నెల్లూరు సిగలో నెలవంకలు



మనసుకవి ఆత్రేయ మనవాడు.
మనిషికి మనసున్నంత కాలం సజీవుడు.
ఆయన పాటలు వింటూ స్మరిద్దాం.
ఆత్రేయ మరణాన్ని విస్మరిద్దాం.

ఆత్రేయ జీవన యానంలో సినీరంగం తుది మజిలీ. సినిమాలకు పాటలు రాసేపని లోనే ఆయన మనిషికి మనసుకు మధ్య ఉన్న అనుబంధంపై పరిశోధన చేసి పాటల రూపంలో మనకందించాడు. ఆయన రాసిన ప్రతిపాట ఒక ఆణిముత్యమే. కలిసిన మనసులకు, విడిపోయిన హృదయాలకు ఊరటనిచ్చే మందులు ఆత్రేయ పాటలు.

మనసుగతి ఇంతే,
మనిషి బ్రతుకింతే,
మనసున్న మనిషికి
సుఖములేదంతే

అంటూ మనసు చేసే మోసంపై మరోపాటలో మనసుపై మాటల కత్తిని దించాడు. మౌనమే నీభాష ఓ మూగమనసా అంటూ మనసు మనిషి జీవితాన్ని ఎంత కల్లోలం చేస్తుందో వివరిస్తూ, కలలు కనడం అవి కల్లలైతే కన్నీరు కార్చడం కూడా నీపనే అంటూ మనసును నిందించారు. మనసును మాయలమారిగా, తెగిన గాలిపటంగా అభివర్ణించాడు. నిజమైన ప్రేమకు, విరహంలో పడే వేదనే కొలమానమన్నది ఆత్రేయ అభిప్రాయం. అందుకే ఆయన ఒక పాటలో

వలపుల తొలిసిన నామనసునకు
వగపుల మాత్రం తెలియనిదా. మనసు నొచ్చినదే
నిజమైతే మన్నించుటయే
మంచిదంటూ

రాసి, కంట తడిపెట్టిస్తాడు. నవ్వినా ఏడ్చినా కన్నీళ్లే వస్తాయని రాసిన ఆత్రేయ, పాటలు రాసి ప్రజలను, రాయక నిర్మాతలను ఏడిపిస్తాడన్న నానుడి సినీపరిశ్రమలో అందరినోళ్లలో నానుతుండేది. ప్రేమికుల విరహ తాపాలను వియోగాలను, హృదయవేదనల్ని ఎంత చక్కగా నివేదిస్తారో, వారి మధ్య విరబూసిన ప్రేమ భావాలను కూడా అందమైన మాటలతో పాటలల్లి ప్రేమికుల హృదయ కుహరాలకు సమర్పించారు.

"నే"నన్నది ఏకవచనం
"మన"మన్నది బహువచనం
ప్రేమలోన ఏకమైన
మనం మాత్రం ఏకవచనం"-

అంటూ రెండు హృదయాల కలయికను ఇంతకంటే అందంగా నిర్వచించిన కవి ఆంధ్రదేశంలో లేనేలేరు. ప్రేమ మొగ్గ తొడిగే దశలో ఎంత తమాషాగా ఉంటుందో 'నేను' అనే కవితలో ఆత్రేయ ఎలా చెప్పారో చూడండి.

నేను నిన్ను చూసినప్పుడు
నీవు నేల చూస్తావు
నేను నింగిచూసినప్పుడు
నీవు నన్ను చూస్తావు
ఇద్దరి చూపులు కలిసినప్పుడు
ఏమవుతుందో చూద్దామా!

అన్న ఆత్రేయ, అదే ప్రేమికులు విడిపోతే ఎలా ఉంటుందో మరో కవితలో గుండెలు తరుక్కుపోయేట్లు వర్ణించారు.

విడిపోయి తెలుసుకొంటిని
కలిసుండుట ఎంత బాధని

అంటూ భగ్న హృదయవేదనకు అక్షర రూపం ఇచ్చారు.

కొరవ 6వ పేజీలో

## వారఫలాలు

*26.2.2000 తేది నుండి 3.2.2000 తేది వరకు; మేషంలో గురు, శనులు; కర్కాటకంలో రాహువు; మకరంలో కేతు, శుక్రులు; కుంభంలో రవి, బుధులు; మీనంలో కుజుడు; వృశ్చిక, ధనుర్మకరాలలో చంద్రుడు.*

### మేషం
(అశ్విని, భరణి, కృత్తిక 1వ పాదం)

వ్యాపార, వృత్తి, వ్యవసాయాలలో ఆదాయం బాగుంటుంది. తరుగ అవసరాలు ఏర్పడి ఖర్చులు పెరిగిపోతాయి. అప్పుగా కూడా తీసుకోవలసి రావచ్చును. నరాల బలహీనత ఎక్కువగా ఉంటుంది. దూర ప్రయాణాలు, బంధుమిత్రుల రాకపోకలు, కొత్త పరిచయాలుంటాయి. ఉద్యోగులు బాగా పనిభారంతో శ్రమపడతారు. అధికారుల అనుకూలత బాగుంటుంది.

### వృషభం
(కృత్తిక 2,3,4 పాదాలు, రోహిణి, మృగశిర 1,2 పాదాలు)

బంధువర్గంలో విభేదాలు రావచ్చును. అనవసర వ్యవహారాలలో తలదూర్చకండి. ఆర్థికస్థితి బాగుంటుంది. వృత్తి, వ్యాపారాలలో మంచి ఆదాయం, రావలసిన బాకీలు నిలబడిపోతాయి. ప్రయత్నిస్తున్న పనులు కొంత నిరాశ కలిగించవచ్చును. కాని అనుకూలంగానే జరుగుతాయి. విద్యాప్రగతి బాగుంటుంది. శ్వాసకోశ రుగ్మతలు రాగలవు. వారంలో అదనపు ఖర్చులు మీకు తప్పవు. శుభకార్యాలలో పాల్గొంటారు.

### మిథునం
(మృగశిర 3,4 పాదాలు, ఆర్ద్ర, పునర్వసు 1,2,3 పాదాలు)

పిల్లల, కుటుంబ సభ్యుల అనారోగ్య బాధలుంటాయి. వృత్తి, వ్యాపార, వ్యవసాయ రంగాలలో ఆదాయం బాగుంటుంది. ఇంటరితో గల అభిప్రాయభేదాలు సర్దుకుంటాయి. సమస్యలు పరిష్కారం కాగలవు. సొంత పనులున్నా సన్నిహితులు సహకరించి పూర్తి చేస్తారు. రాజకీయ పలుకుబడి బాగా సాగిపోతుంది.

### కర్కాటకం
(పునర్వసు 4 పాదం, పుష్య, ఆశ్లేషలు)

చేస్తున్న పనులలో స్తిమితం తక్కువగా ఉంటుంది. అయినా పనులు అనుకూలంగానే నెరవేరగలవు. అవసరాలకు ఆర్థికంగా తోడ్పడగల బంధుమిత్రులుంటారు. వ్యవసాయ, పరిశ్రమల రంగాలలో ఆదాయం సంతృప్తికరంగా ఉంటుంది. వ్యాపారస్తులు అవసరాలకు డబ్బు అందక, బాకీలు రాక బాధపడతారు.

### సింహం
(మఖ, పుబ్బ, ఉత్తర 1వ పాదం)

సన్నిహితులతో, బంధుమిత్రులతో విభేదాలు రాకుండా జాగ్రత్తపడాలి. పూర్తి అయిపోతాయనుకొన్న పనులు నిలబడిపోతాయి. కుటుంబ సభ్యులకు కొద్ది అనారోగ్యం ఉంటుంది. ఆస్తి వ్యవహారాలు, రావలసిన ప్రభుత్వ సహాయం అనుకూలం కాగలదు. వృత్తి, వ్యాపార రంగాలలో ఆదాయం బాగుంటుంది. నిర్మాణాలు, స్థిరాస్థుల క్రయవిక్రయాలు జరుగును. వారాంతంలో అవసరమైన ఖర్చులు, వస్తువులు కొనడం జరుగుతుంది.

### కన్య
(ఉత్తర 2,3,4 పాదాలు, హస్త, చిత్త 1,2 పాదాలు)

శుభకార్యాలలో పాల్గొనడం, రావలసిన రుణాలు పొందడం, వృత్తి, వ్యాపారాలలో పెట్టుబడులకు మంచి అవకాశాలు రావడం జరుగుతుంది. ఇతరులతో విభేదాలు సర్దుకుంటాయి. ఆరోగ్యం సరిగా ఉండదు. ముఖ్యమైన పనులకు ఆటంకాలుంటాయి. వారాంతంలో కొత్త వస్తువులు కొనడం, అనుకోని ప్రయాణాలుంటాయి.

### తుల
(చిత్త 3,4 పాదాలు, స్వాతి, విశాఖ 1,2,3 పాదాలు)

శుభకార్యాలకై మీ ప్రయత్నాలు అనుకూలిస్తాయి. సొంత పనులు ప్రభుత్వంతో గల పనులు కొనసాగుతాయి. వృత్తి, వ్యాపార, వ్యవసాయ రంగాలలో ఆదాయం పెరుగుతుంది. విలువైన వస్తువులు, భూములు కొనడం జరుగుతుంది. సన్నిహితులకు సహాయపడగలరు. సామాజిక, రాజకీయ కార్యాలలో మీ అవసరం ఎక్కువగా ఉంటుంది. ఉద్యోగులు సమర్థత చాటుకొంటారు.

### పంచాంగం

**ముహూర్తాలు**

మార్చి 1 తేది బుధవారం రాత్రి గం11.49లకు వృశ్చికలగ్నాన వివాహ, గృహప్రవేశాలకు సుముహూర్తాలున్నాయి.

**పండుగలు**

తేది 4 శనివారం శివరాత్రి పర్వదినం.

**ఫిబ్రవరి తిథులు**

**మాఘ బహుళ**

| | | | |
|---|---|---|---|
| తేది 26 | శని | సప్తమి రా 9.40 | గం.వ |
| తేది 27 | ఆది | అష్టమిరా 11.30 | గం.వ |
| తేది 28 | సోమ | నవమిరా 1.30 | గం.వ |
| తేది 29 | మంగళ | దశమిరా 3.40 | గం.వ |

**మార్చి తిథులు**

| | | | |
|---|---|---|---|
| తేది 1 | బుధ | ఏకాదశి | పూర్తిగ |
| తేది 2 | గురు | ద్వాదశి | పూర్తిగ |
| తేది 3 | శుక్ర | త్రయోదశి | పూర్తిగ |

స్వయంపాకుల శ్రీనివాసులు, ఎం.ఏ.

### వృశ్చికం
(విశాఖ 4 పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

పిల్లల అభివృద్ధిని గూర్చిన ఆందోళన ఉంటుంది. స్థిరాస్తుల వద్ద, డబ్బు వద్ద పేచీలు రావచ్చును. అల్లులతో తగాదాలు కలుగుతాయి. ఆర్థికస్థితి బాగుండి ఆదాయం పెరిగినా, అదనపు ఖర్చులు పెట్టకతప్పదు. చేస్తున్న పనులకు ఆటంకాలు కలిగించేవారుంటారు. బంధువర్గంలో అపార్థాలు కలుగుతాయి.

### ధనుస్సు
(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1పాదం)

ప్రభుత్వం వల్ల జరుగవలసిన పనులు సవ్యంగా సాగుతాయి. బంధుమిత్రులు మీ పనులకు తోడ్పడతారు. ఆర్థికస్థితి బాగుండి ఇతరులకు సహాయపడతారు. వ్యాపార రంగంలో కొత్త అవకాశాలు, రావలసిన బాకీలు లభించడం, శుభకార్యాలలో మీరు సహాయపడటం ఉంటుంది. వారం ప్రారంభంలో కొద్ది పాటి అనారోగ్యం ఉంటుంది. కళా, సాహిత్య, రాజకీయ రంగాలలో మంచి గుర్తింపు అవకాశాలుంటాయి. అనుకోని ప్రయాణాలు, ప్రముఖుల పరిచయాలుంటాయి. విద్యాప్రగతి బాగుంటుంది.

### మకరం
(ఉత్తరాషాఢ 2,3,4 పాదాలు, శ్రవణ, ధనిష్ఠ 1,2 పాదాలు)

వృత్తి, వ్యాపార, పారిశ్రామిక రంగాలలో ఆదాయం బాగుంటుంది. ప్రభుత్వ రుణాలు మంజూరుకాగలవు. అనుకోని ప్రయాణాలు, ప్రముఖుల పరిచయాలు, స్థిరాస్తుల క్రయవిక్రయాలు జరుగుతాయి. ఉదర రుగ్మతలుంటాయి. విద్యా ప్రగతి బాగుంటుంది. అనుకూలమైన వార్తలు వినడం, సాంఘిక సేవా, రాజకీయ రంగాలలో మంచి ప్రోత్సాహం ఉంటుంది. అప్పుడప్పుడు కొందరి విషయంలో భయం, సందేహాలుంటాయి. సన్నిహితులను గమనించుకొనండి. పనిభారం పెరుగుతుంది.

### కుంభం
(ధనిష్ఠ 3,4 పాదాలు, శతభిష, పూర్వాభాద్ర 1,2,3 పాదాలు)

సొంత పనులు, ప్రభుత్వం వద్ద పెండింగ్ పనులు సరిగా జరుగవు. మీ ఆదాయం ఖర్చులకు సరిపోతుంది. ఆలోచనలు మీ అభివృద్ధి విషయంలో బాగున్నా ఆచరణలో అమలు జరుగవు. ఉద్యోగులకు బాధ్యతలు పెరిగి శ్రమపడతారు. కుటుంబ సభ్యుల అనారోగ్యం, ప్రయాణాలు, శుభకార్యాల వల్ల ఖర్చులుంటాయి. రాజకీయ, సాహిత్య రంగాలలో అనుకూలత బాగుంటుంది.

### మీనం
(పూర్వాభాద్ర 4 పాదం, ఉత్తరాభాద్ర, రేవతి)

వృత్తి, వ్యాపార, వ్యవసాయాలలో ఆదాయం బాగుంటుంది. అనుకోని పెద్ద ఖర్చులు వారాంతంలో పెట్టగలరు. బంధుమిత్రులతో మనస్పర్థలుంటాయి. జరుగవలసిన పనులు వాయిదా పడతాయి. సాంస్కృతిక, రాజకీయ రంగాల వారికి దూరప్రయాణాలు, ప్రగతి, పేరు ప్రతిష్ఠలు బాగుంటాయి. విద్యా ప్రగతి బాగుంటుంది. ఎదురు చూస్తున్న సొంత పనులు అనుకూలిస్తాయి. బంధుమిత్రుల అనారోగ్యవార్తలు వింటారు. ఆరోగ్యం బాగుంటుంది. అధికారులు మీపై అదనపు పనులు పెడతారు.

## కునుకు లేక

4వ పేజీ తరువాయి

పోతున్నారు. గత 40 సంవత్సరాల్లో ఎన్నడూ ఇటువంటి పరిస్థితి లేదన్నారు. జిల్లాను కరవు ప్రాంతంగా ప్రకటించినా, ప్రభుత్వం నుంచి అరకొర చర్యలు తప్ప, రైతులను, కూలీలను, ప్రజలను ఆదుకొనేందుకు తగిన నిధులు కేటాయించి సహాయక చర్యలు చేపట్టలేదన్నారు. డిఆర్‌సికు ప్రతినిధి బృందం విజ్ఞాపన ఇవ్వగా కరవు ప్రాంతాల్లో శిస్తులు మాఫీ చేస్తూ, బ్యాంకు రుణాలు వాయిదావేస్తూ, కరవు పనులు యంత్రాల ద్వారా చేయకుండా జీపీలు ఇచ్చినట్లు చెప్పారు. సిపిఎం నాయకులు చంద్రరాజగోపాల్, టి. మాల్యాద్రి, మాదాల వెంకటేశ్వర్లు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

### వాణిజ్యపన్నుల శాఖలో ఉద్యోగుల సంఘం

ఆంధ్రప్రదేశ్ వాణిజ్యపన్నుల శాఖ నాన్ గెజిటెడ్ వుద్యోగుల సంఘం నెల్లూరు, ప్రకాశం, జిల్లాలకు సంబంధించిన డివిజన్ ఎన్నికలు 20తేది పొగతోటలోని మూన్ లాండ్ అపార్టుమెంట్‌లో గల డివిజన్ కార్యాలయంలో జరిగాయి. ప్రతిష్టాత్మకంగా రెండు ప్యానల్ మధ్య జరిగిన ఎన్నికల్లో అధ్యక్షునిగా టి.నాగభూషణం, అసోసియేట్ అధ్యక్షునిగా ఎం.రమణయ్య ఉపాధ్యక్షులుగా షేక్ ఇస్మాయిల్, వై. శంకరరెడ్డి, కార్యదర్శిగా ఏ. రామకృష్ణ, ఆర్గనైజింగ్ కార్యదర్శిగా ఇ. రఘురామిరెడ్డి, సహకార్యదర్శులుగా ఎం.శ్రీనివాసులు, విజయకుమార్‌రెడ్డి, కోశాధికారిగా ఎం.ఎస్. ఆర్‌కె. వరప్రసాదరావులను ఎన్నుకొన్నారు. ఎన్నికల్లో రెండు జిల్లాలకు చెందిన 281 మంది ఉద్యోగులు పాల్గొనగా, ఎన్నికల అధికారిగా రఘునాథబాబు వ్యవహరించారు.

### ఉచిత మెగా వైద్యశిబిరం

నెల్లూరుటౌన్ జూనియర్ ఛాంబర్, సెయింట్ జోసఫ్ ఆసుపత్రిలో సంయుక్తంగా ఉచిత మెగా వైద్య శిబిరాన్ని 19,20తేదుల్లో నిర్వహించాయి. 15 మంది మల్టీ స్పెషాలిటీ డాక్టర్లు ఈ శిబిరంలో పాల్గొని 3000 మంది రోగులను పరీక్షించి ఉచితంగా మందులు పంచిపెట్టారు. శిబిర ప్రారంభోత్సవ సభలో ముఖ్యఅతిథిగా ఎస్పీ సివి. నరసయ్య, ఆనం జయకుమార్‌రెడ్డి, వైద్య ఆరోగ్యశాఖాధికారి మధుసూధన్ సింగ్ విచ్చేశారు. జూనియర్ ఛాంబర్ అధ్యక్ష, కార్యదర్శులు బి.వి. సురేష్ కుమార్, టివి. సుబ్బారావు కూడా ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

### సాహిత్యసభలు

వర్తమాన సమాజంతృత్వంలో ఫిబ్రవరి 18తేది టౌన్‌హాల్‌లో రామకృష్ణ పరమహంస జయంతి సభ వేణుగోపాల స్వామి కాలేజి తెలుగు లెక్చరర్ డాక్టర్ కాకుటూరు వసుంధర అధ్యక్షతన జరిగింది. గూడూరు డిఆర్‌డబ్ల్యు కళాశాల ప్రిన్సిపల్ డాక్టర్ మెహర్ మణి పరమహంస సందేశం, బోధనలను గూర్చి విపులంగా వ్యాఖ్యానించి విశదీకరించారు. సభాపోషకులు రిటైర్డ్ మునిసిపల్ కమీషనర్ ధర్మారెడ్డి, మెహర్‌మణిని ఘనంగా సన్మానించారు.

ఫిబ్రవరి 21తేది శ్రీకృష్ణ దేవరాయ జయంతి సభకు నెల్లూరు వేద సంస్కృత కళాశాల రీడర్ డాక్టర్ అమృతవాక్కుల శేషుకుమార్ అధ్యక్షత వహించగా, తిరుపతి ఎస్వీ యూనివర్సిటీ తెలుగు ప్రొఫెసర్ డాక్టర్ కె. సర్వోత్తమ రావు, కృష్ణదేవరాయల ఆముక్తమాల్యదలోని ప్రధానాంశాలను గూర్చి వివరించి సభాపోషకులు పూనూరు పోలారెడ్డి

చేతుల మీదుగా సన్మానం పొందారు. ఈ కార్యక్రమాల్లో సమాజం అధ్యక్ష కార్యదర్శులు వెంకురెడ్డి, రామసుబ్బారెడ్డి కూడా పాల్గొన్నారు.

### నెల్లూరులయన్స్ క్లబ్‌సేవ

నెల్లూరు లయన్స్ క్లబ్ బొల్లి వ్యాధితో బాధపడుతుండిన ఒక బాలికకు 2లక్షల రూపాయలు విలువ చేసే ఆపరేషన్ వుచితంగా చేయించింది. ఈ వ్యాధి చికిత్సలో ఖ్యాతి గాంచిన డాక్టర్ బి. నరసింహారావు నెల్లూరు జయభారత్ హాస్పటల్‌లో 22తేది ఈ ఆపరేషన్ నిర్వహించారు. మరి కొంత మంది వ్యాధిగ్రస్తులకు ఈ ఆపరేషన్లు ఉచితంగా చేయిస్తామని క్లబ్ అధ్యక్ష, కార్యదర్శులు పి. ఆనందకృష్ణ, వి.మనోహర్‌రెడ్డి చెప్పారు.

### యశోధర ప్రచారం ప్రారంభం

నెల్లూరు మునిసిపల్ ఛైర్మన్‌గా కాంగ్రెస్ అభ్యర్థిగా పోటీ చేస్తున్న డాక్టర్ పల్లంరెడ్డి యశోధర 3వ వార్డు పరిధిలోని వేణుగోపాలనగర్ 3వ మైలు ప్రాంతం నుంచి 24తేది తన ప్రచారం ప్రారంభించారు. ఈ సందర్భంగా మాట్లాడుతూ పట్టణ ప్రజలు ఎదుర్కొంటున్న ప్రధాన సమస్యలపై ఒక అవగాహన వుందని వాటి పరిష్కారానికి కృషి చేస్తానన్నారు. డ్రైనేజి వ్యవస్థను ఆధునీకరించి పట్టణంలో పారిశుధ్యాన్ని మెరుగు పరుస్తానన్నారు. నెల్లూరు ఎమ్మెల్యే వివేకానందరెడ్డి మాట్లాడుతూ కాంగ్రెస్ పార్టీ అభ్యర్థులను విజయపథంలో నడిపించి నెల్లూరు నగర అభివృద్ధికి తోడ్పడాలన్నారు. రాపూరు ఎమ్మెల్యే ఆనం రామనారాయణరెడ్డి మాట్లాడుతూ నెల్లూరుటౌన్‌లో అభివృద్ధి పథంలో నడిపించగల సత్తా డాక్టర్ యశోధరకు వుందన్నారు. పాదయాత్ర చేస్తూ 3వార్డు పరిధిలో ఇంటింటికి వర్షంలో తడుస్తూ యశోధర చేసిన ప్రచారం ఆ ప్రాంతీయులను ఆకట్టుకొంది.



నెల్లూరులో హోటల్ మూరసిని ప్రారంభిస్తున్న మాగుంట శ్రీనివాసులురెడ్డి, ప్రక్కన ఎమ్మెల్యేలు రామనారాయణ రెడ్డి, వివేకానంద రెడ్డి, హోటల్ అధినేతలు ఎం.ఎస్. గణేష్, శంకర్‌లు వున్నారు.

### నెల్లూరుసంగతులు

4వ పేజీ తరువాయి

సిబ్బందిపై తమకు టీపి అంటూ విరుచుకపడడాన్ని ఉద్యోగులు విమర్శిస్తున్నారు. ఎన్నికలయ్యి కొత్త పాలకులు వచ్చే వరకు మునిసిపల్ వుద్యోగులు జీతాలు లేకుండా విధులు నిర్వర్తించాల్సిన దుస్థితి, కమీషనర్‌కు ముందు చూపు లేకపోవడం వల్ల దాపురించింది.

# మాతృదేవోభవ:



నిర్యాణం : 1995 మార్చి 1 తేది

# స్వర్గీయ శ్రీమతి రుక్మిణమ్మ

(స్వర్గీయ తిక్కవరపు బాబురెడ్డిగారి ధర్మపత్ని)

**మా మాతృమూర్తి పంచమ వర్ధంతి** సందర్భంగా

ఆమె ఆత్మశాంతికై భగవంతుని ప్రార్థిస్తూ ...
ఆమె ఆత్మీయులైన వారందరికీ
మా మాతృదేవత ఆశీస్సులు కోరుకుంటూ ...

— డాక్టర్ టి. సుబ్బరామరెడ్డి
కుటుంబ సభ్యులు

Edited, Printed and Published by N. Dolendra Prasad at Zamin Ryot Press, Ph: 091-861-327354. Offset Printing at Zamin Ryot Press, Nellore